విశాఖ సాహితి 63వ ప్రచురణ

# అనంత సాగరం

ఎల్. రాజేష్

# అనంత సాగరం

## కథా సంకలనం

విశాఖ సాహితి ప్రచురణ 63

ప్రథమ ముద్రణ - నవంబరు 1996

కథానికా సంకలనం సర్వస్వామ్యాలూ రచయితవే

ముఖచిత్ర సేకరణ : (జి.కె. ప్రింట్‌హౌస్)

ప్రతులకు : **ఎల్. రాజేష్**
ఎం.ఐ.జి. 40, ఎ.పి. హెచ్.బి. కాలనీ
జిల్లాపరిషత్ ఎదురుగా, శ్రీకాకుళం

**విశాఖ సాహితి**
30-11-12, డాబాగార్డెన్స్
విశాఖపట్నం - 20.

ముద్రణ : జి.కె. ప్రింట్ హౌస్

వెల : రూ. 25/-లు

---

ఇది విశాఖ సాహితి రజతోత్సవ సంవత్సరంలో
ఎన్నుకోబడిన ప్రచురణ.

# భగవదార్పణం

ఆత్మసాక్షిగ పలికె నవ్య నాదములు
జన్మమిచ్చిన తమకు ధన్యవాదములు
తన్మయముతో కొలుతు నీదు పాదములు
నిర్మలముగ ఇత్తు నీకు హారతులు

# ఇందులో.......



# పీఠిక

# అనంత సాగర తరణం

కళాప్రపూర్ణ
**డా॥ గణపతిరాజు అచ్యుతరామరాజు**

ఇది యువమిత్రులు చిరంజీవి ఎల్ రాజేష్ రచనావతరణం. పద్దెనిమిదేళ్ళ ఈడుగల బి ఎస్సీ విద్యార్థి వ్రాసిన కథల్లో పదహారు కథల కూర్పు తనపై ప్రభావం చూపిన స్ఫూర్తినిచ్చిన పూర్వాంధ్ర కథకులను వీరారాధకుడై దాసోహ మయిపోకుండా తరుణమైన తన గొంతునే విప్పి పాడి, తన రెక్కల్తోనే విహరించే కథక రాజహంస కిశోరంలా నాకు అనిపిస్తారీయన

తెలుగులో గురజాడ అప్పారావుతోనే కథా రచనం ఆరంభమైందనే భావం చాలామంది హృదయాల్లో పాతుకుపోయి ఉంది రెండో ప్రపంచ యుద్ధానంతర రాజకీయ సాంఘిక పరిస్థితులాయనకా పీఠం కట్టబెట్టాయి ఋగ్వేదంలోనే యమ యమీ ఊర్వశీ పురూరవ, లోపాముద్రాగస్త్య, శంబరారి, విశ్వామిత్ర, నదీద్వయ సంవాద గాధలూ, ఉషోదయ వర్ణనలూ ఉన్నాయనీ, వాటిలో మానవ జీవన వికసనం ద్యోతకం అవుతుందనీ ఎవరేనా ఎత్తి చూపించితే, వాళ్ళకి కుల, మత వర్గ తత్త్వాలనో, వేటినో అంటగట్టి ఛాందసులని వెక్కిరించి "వేదాల్లోనే అన్నీ ఉన్నాయష్రోయ్" అని అవహేళన చేసే ప్రబుద్ధుల రాజరికంలో ఈ శతాబ్దపు ఉత్తర భాగం నడుస్తున్నది. ఒక్క గురజాడ అప్పారావు నాటకాన్ని కంఠస్థం చేసుకొని, అంతకు ముందుగాని, వెనుకగాని సాహిత్యం లేదని వితండవాదం చేస్తూ తమ సాహితీ జీవితాన్ని గడిపేస్తున్న వారెందరో ఉన్నారు. మరికొందరయితే కథల మేస్త్రీలతోనో, కథల మేస్టర్లతోనో, కథక చక్రవర్తులతోనో తెలుగు కథ పుట్టిందంటున్నారు. అట్టివారు ఈ శతాబ్దపు రెండవ, మూడవ,

నాలుగవ దశకాల్లోని పేర్లు తలచనివ్వరు నేడు పుట్టిన కథకుడు నిన్న పుట్టిన కథకుని పేరు తలచడు తలచనివ్వడు

కథలకు గల ప్రయోజనాలను కూడా ఒక్కొక్క వర్గం ఒక్కొక్క తీరున వివరిస్తూ చిన్న చిన్న పెద్ద పెద్ద కథా దివాణాలు, కథా మొఖాసాలు, కథా జమిందారీలు, కథా సామ్రాజ్యాలు ఏర్పాటు చేసుకుంటూ ప్రచ్ఛన్నంగానో ప్రత్యక్షంగానో యుద్ధాలు చేస్తున్నారు మేలు ఎంతో కీడు కూడా అంతగానే జరిగేటట్లు ఉద్యమాలు ఉప్పెనల్లా వచ్చి వరదల్లా కొట్టుకొని పోతున్నాయి

వైదిక, బౌద్ధ, జైన, సంస్కృత, పురాణ, ఇతిహాసాదులలోని అపారమైన కథా సాహిత్యాన్ని మనం పరిగణనలోకి తీసుకుంటే, అలానే ఇతర మతాల పవిత్ర గ్రంధాలలోని కథలను పరామర్శిస్తే మనకు ఆత్మబోధ కలుగుతుంది ఆంధ్ర మహాభారతంలో ఒక్క శాంతి పర్వం చాలు ఆంధ్ర మహాభాగవతంలోని దశమస్కంధం చాలు. మన కథా సాహిత్య సంపద ఎంతటిదో తెలుస్తుంది వాటి మహత్తర శక్తిని తట్టుకొనలేకనేమో ఓ పాతికేళ్ల క్రిందట రామాయణ, భారతాదుల్ని తగలవెయ్యమన్న సాంస్కృతిక విప్లవం దేశంలో తాటాకు మంటలా ఎగిసి చల్లారింది.

అట్టి ఈ శతాబ్దపు చివరి దశకంలో పుణ్యం చేసుకునో, పాపం చేసుకునో, రచయితగా ఈ రాజేష్ పుట్టారు ఆయా సాహిత్య సంస్థల సిద్ధాంతాలనే పెళ్లి కూతుళ్లకు ఓ కొత్త కథాక వరుడు దొరికాడు. ఆయన అదృష్టం ఎలా ఉందో!

వేద ఋక్కుల్లోని ప్రతీకల్నీ, అర్థాలనీ నిరుక్తం చెబుతుంది. అలంకార శాస్త్రంలోని రూపకాలంకారం ప్రతీకాత్మక, సూర్మిక కవిత్వాలకు కన్నతల్లి వంటిది. దాని బిడ్డలే ఆఖ్యానాలూ, ఏలిగోరీలూ, పేరబిల్సు వగైరాలన్నీ, ఒక గాయత్రిని, ఒక సావిత్రిని ఒక శ్రీవిద్యను అర్థం చేసుకొనే యత్నమే చాలును. మనల్ని దివ్య లోకాల్లో సంచరింపజేస్తుంది అరవిందుని 'సావిత్రి'నీ, బన్‌యన్స్ 'పిలిగ్రిమ్స్ ప్రోగ్రెసు'నూ, కొడవగంటి 'దిబ్బరాజ్యపు' కథలనూ, రావిశాస్త్రి 'పిపీలికాన్నీ' సంస్కృత ప్రబోధ చంద్రోదయాన్ని' చదివిన వారికి "గల్పిక" అనే సాహిత్య ప్రక్రియ స్వరూపం

క్షుణ్ణంగా అవగతమవుతుంది. ఈ శతాబ్దపు నాలుగవ దశకంలో మదరాసు "నమ్మాళ్వార్స్" వారు ప్రచురించిన రష్యన్ 'గల్పికలు' మన ఆంధ్ర రచయితలను కూడా ప్రభావితం చేసాయి. అలనాటి విశాఖ రచయితల సంఘ సభ్యుడూ, విజయనగరార్ష సాహితి వ్యవస్థాపకులూ అయిన 'పూభా' (శ్రీరంగుడు వెంకట రమణమూర్తి) ఎన్నో గల్పికలను వ్రాసి గల్పికా సాహిత్యాన్ని పరిపుష్టం చేసారు

యువమిత్రులు రాజేష్ "అనంత సాగరం" కథ ఒక గల్పికే ఆ పేరిటి ఈ సంకలనంలో చాలా గల్పికలున్నాయి - ఆ గల్పికలూ, సాదా కథలూ 'ఆలోచనామృతం'గానే ఉన్నాయి. ఎవరో ఒక ఆంగ్ల రచయిత 'డబుల్ ట్విస్టు' ప్రభావంలో పడిపోకుండా ఆయన తన ప్రతీ కథలోనూ, ప్రతీ గల్పికలోనూ చివరి వాక్యాల్లో మెఱుపులు మెఱిపించారు. ఆ ముక్తాయింపులు ఆయనకు మంచి భవిష్యత్తుందని చెబుతాయి

స్పృహ లేకుండా, ఏదో ప్రయోజనం ఆశించకుండా ఎవరూ ఏ రచనా చేయరు - మంచి చెడ్డల్లో ఏ కథ అని చెప్పి ప్రశ్నించి, రచయితల్ని వారు వారిచ్చే సమాధానాలను బట్టి వర్గీకరించి 'బ్రెయిన్ వాష్' చేసి తీర్థం యిప్పించి తమ వర్గంలోకి చేర్చుకొని, తమకు నచ్చని వాణ్ణి వేటాడి చీల్చి చెండాడే రోజుల్లో వున్న కథకులీ రాజేష్. ఆయా తీవ్రవాదులు చెప్పే గద్దింపుల్లోని సత్యాన్వేషణ కోసం 'శబ్దకోశాలు' తెరిచి చూస్తే కథ్ (కథయతి) కథిత, అనే సంస్కృత పదాలకి చెప్పట, వెల్లడి చేయుట, తెలుపుట, వివరించుట అని అర్థాలున్నాయి ఫ్రెంచిలో కథను 'రెసిట్' రెసితస్కో అంటారు. చెప్పట, కథనం చేయుట మళ్ళీ మళ్ళీ చెప్పట ఇటాలియన్ స్టోరియా అనే పదానికి (హిస్టరీ) అనీ (టేల్) అనీ అర్థాలున్నాయి. ఆంగ్ల నిఘంటుకారుల్లో ఫౌలర్ Story అనే దానిని PIECE OF NARRATIVE, TALE OF ANY LENGTH TOLD OR PRINTED IN PROSE OR VERSE OF ACTUAL OR FICTITIOUS EVENTS, LEGEND,MYTH, ANECDOTE, NOVEL, ROMANCE, NARRATIVE OR DESCRIPTIVE ITEM OF NEWS అని నిర్వచించాడు. ప్రాచ్య పాశ్చాత్యాలంకారికులు సాహిత్య ప్రయోజనం గురించి విభేదించారనుకోనక్కరలేదు.

ప్రాచీన భారతీయాలంకార శాస్త్రజ్ఞులు చెప్పినవి త్రికాలా బాధితంగా సార్వదేశికంగా అంగీకరింపబడ్డవే

"It is difficult to agree with those for whom any ideological criticism of the mathematisation of the social sciences is alien to the true contemporary requirements of a modern scientific Marxist Methodology" అని L. DOLEZEL తన Probability Approach to the Theory of Style in Artలో చెప్పిన విషయాన్ని అంగీకార యోగ్యంగానే భావించినా నేటి విమర్శకుల్లో కొందరు ఎందుకు ఈతరం రచయితల్ని సిద్ధాంతాల పేరిట దుయ్యబడుతున్నారో తెలియదు

రాజేష్ సిద్ధాంతాలేమిటో, ఆయన సమాజ స్పృహ ఎంతటిదో ఇందులో కథలు చెబుతాయి. ఆయన అన్ని వర్గాలకూ ఆమోదయోగ్యుడుగానే రూపు దిద్దుకోగలరని నా నమ్మకం.

విశాఖ సాహితికి పాతికేళ్ళ నిండాయి. ఇరవయ్యారో సంవత్సరం నడుస్తుంది. ఈ సంవత్సరం - ఓ ఏడాది ఆలస్యమైనా - రజతోత్సవాలను నిర్వహిస్తూ కొన్ని రచనలను సభ్యుల స్వంత వనరులతోనే ప్రచురించాలనీ, సంవత్సరం పొడుగునా, సాధ్యమైనన్ని ప్రచురణలు వెల్వరించాలనీ సంకల్పించింది.

ఈ యువ రచయిత విశాఖ సాహితికి ఇచ్చిన కానుక ఇది - విశాఖ సాహితి లోని పెద్ద రచయితలు శ్రీ రాజేష్ రచనలను మెచ్చుకున్నారు. ప్రోత్సహించారు. రచయిత తండ్రిగారు శ్రీ ఎల్.రామ కృష్ణారావుగారు మిక్కిలి అభినందనీయులు.

ఇందులో కథలు మిమ్మల్ని సునాయాసంగా చదివించడమేకాక, మీ చేత ఈ యువ రచయితకు ఆశీస్సులు అందజేస్తాయని కూడా నా విశ్వాసం

---

విశాఖపట్నం

26-11-96

# కృతజ్ఞతాభివందనములు

నన్ను అడుగడుగునా ప్రోత్సహించటమే కాకుండా ఈ పుస్తకాన్ని 'విశాఖ సాహితి' తరపున అచ్చువేయించటానికి అనుమతినిచ్చిన విశాఖ సాహితి అధ్యక్షులు, మా గురువుగారు, పూజ్యులైన కళాప్రపూర్ణ **శ్రీ అచ్యుత రామరాజుగారికి** నేనెంతో ఋణపడిఉన్నాను. అంతేకాక వారు ఈ పుస్తకానికి తమ అమూల్యమైన పీఠికను రచించి నందుకు మరొకసారి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ పుస్తకానికి **'అనంతసాగరం'** అన్న టైటిల్‌ని సూచించిన పూజ్యులు **శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావుగారికి**, ఆశీస్సులను అందించిన విశాఖ సాహితి సీనియర్ సభ్యులందరికీ పేరు పేరునా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తక ప్రచురణకై నన్ను ప్రోత్సహించి ఆర్థిక సహాయాన్ని అందించిన నాన్నగారికి కూడా కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణలో ఎంతగానో సహకరించిన ప్రెస్ యాజమాన్యానికి, డి.టి.పి. డిజైనర్ సూర్యనారాయణ గారికి, సహకరించిన మిత్రులందరికీ ధన్యవాదాలు.

రాజేష్

# పాఠకులకు . . .

అనుభవరాహిత్యం వల్ల మీకు ఈ సంపుటిలో అనేకలోపాలు కనిపించవచ్చు  ఆ లోపాలను నాకు సూచిస్తూ ,ఈ కథలపై మీ అభిప్రాయాలను నాకు తప్పకుండా వ్రాస్తారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకానికి లభించిన స్పందన చూసుకుని త్వరలోనే వంద కవితల సంపుటితో మరొకసారి మీ ముందుకు వస్తాను.  నా తొలి ప్రయత్నంగా ముద్రితమయిన ఈ పుస్తకం మీ అందరి ఆదరాభిమానాలను పొందుతుందని, మీ విమర్శలు నా లోపాలు తెలుసుకొని నన్ను నేను సరిదిద్దుకొనే విధంగానే తప్ప నన్ను నిరాశపరచేవిగా ఉండవని ఆశిస్తూ. . .

**రచయిత**

# అనంత సాగరం

మేమంతా సముద్రం దగ్గర ఆడుకుంటున్నాం. అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి. పదేళ్ళుంటాయేమో!, సముద్రం ఒడ్డున గవ్వలేరుకుంటున్నాం. అప్పుడు సముద్రాన్ని ఆస్వాదించేంత పరిజ్ఞానం లేదు. ఏదో అక్కడైతే గవ్వలేరుకోవచ్చుకదాని వచ్చి ఏరుకొనివెళ్ళిపోయేవాణ్ణి. నాతో పాటూ చాలామంది పెద్దవాళ్ళు కూడా గవ్వలేరుకునేవారు. వాళ్ళేరుకునే గవ్వలకి, మేం ఏరుకొనే గవ్వలకి తేడా వుంది. అక్కడక్కడా కొంతమంది సముద్రం వైపు చూస్తూ ఆనందించేవారు. వారి సంఖ్య చాలా తక్కువ. వాళ్ళు కూడా సముద్రంలో ఈత కొట్టే వాళ్ళను కాక, సముద్రంలో పడవలేసుకొని ప్రయాణించే వారినే గమనించేవారు. కొంతమంది ఏదీ చేయక ఒడ్డున కూర్చుని తమ ప్రేయసితోనో మరెవరితోనో మాట్లాడుకుంటూ గడిపేవారు. నేను గవ్వలేరుకొని వెళ్ళిపోయేవాడ్ని.

అయిదేళ్ళు గడిచాయి. ఆ రోజున నాకెందుకో సముద్రంలో కాలుపెట్టాలనిపించింది. నా ఈడు వారందరూ గవ్వలేరుకుంటున్నారు. నెమ్మదిగా వెళ్ళి కాస్త తడిగా ఉన్న దగ్గర నించున్నాను. ఓ కెరటం వచ్చి నా కాలిని తడిపి రమ్మన్నట్టుగా ఆహ్వానించింది. నాకు చాలా ఆనందం వేసింది. ముందుకు వెళ్దామనుకున్నాను. ఏం లాభం? అమ్మ చూసింది. మరోసారి సముద్రం వైపు వెళ్తే కాళ్ళిరగ్గొడతానంది. బుద్ధిగా గవ్వలేరుకోమంది. నోరుమూసుకొని గవ్వలేరుకున్నాను.

అయితే రోజులు గడిచేకొద్దీ నేను ఎవ్వరికీ తెలియకుండా కాళ్ళు తడుపుకోవటమేమిటి? ఏకంగా ఈత కొట్టటమే నేర్చుకున్నాను. మొదట్లో కొంచెం కొంచెమే వచ్చినా పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి ఈతలో ప్రావీణ్యం సంపాదించాను. నా తోటివాళ్ళే కాక నాకన్నా పెద్దవాళ్ళు కూడా సాధించలేనిది నేను సాధించానని కించిత్ గర్వంగా కూడా ఉండేది. అయితే అది నాలో అహంకారాన్ని మాత్రం పెంచలేదు.

ఓ రోజు దీర్ఘంగా ఆలోచించాను. నా ఈత ప్రావీణ్యం అందరికీ ప్రదర్శించాలన్న కోరిక బలంగా పెరిగింది. వారిమెప్పుకోసం కాదది. నేనంటే ఏమిటో నాకు నేనుగా నిరూపించుకోవటం కోసం.

ముహూర్తం పెట్టుకున్నాను. నన్ను అభిమానించే ఓ నలుగురికి ఈ విషయం చెప్పాను.

"అది అనంతసాగరం" అన్నాడొకడు.

"నువ్వు ఈదలేవు" అన్నాడు మరొకడు.

"నీ లాగనే చాలామంది ప్రయత్నించి మధ్యలోనే మునిగిపోయారు. నువ్వూ అంతే!'
' వేరొకడన్నాడు.

"పోన్లే ప్రయత్నించు. నీ ఆసక్తి మేమెందుకు కాదనటం అయితే అలసిపోతే మాత్రం వెనక్కివచ్చేయ్. ఏం" నాలుగోవాడన్నాడు.

ఉత్సాహంగా ఈత మొదలెట్టాను. ఏమాత్రం అలుపులేదు. నా స్నేహితుల ప్రోత్సాహం మాత్రం వినపడుతోంది. ఒక గంటపాటు ఈదాను. అప్పటికి పడవల్లో ప్రయాణించేవారిని దాటేసాను. వారిని దాటిన గర్వంతో వెనక్కి తిరిగిచూసాను.

నా ఈడువారు గవ్వలేరుకుంటున్నాను. ప్రేయసీ ప్రియులు మాట్లాడుకుంటున్నారు. కొంతమంది తిండిలో నిమగ్నమయి ఉన్నారు. ఎక్కువమంది పెద్దవాళ్ళు గవ్వలు లెక్కపెట్టుకుంటు కనపడ్డారు.

'సముద్రాన్ని ఆస్వాదించే వాళ్ళు ఎక్కడున్నారా? నన్ను గమనిస్తున్నారా లేదా?' అని చూసాను. అదేంటో వాళ్ళు నన్ను గమనించటం లేదు. పడవలేసుకొని ఈత కూడా రాకుండా చేపలు పట్టుకునేందుకు సముద్రాన్ని ఉపయోగించుకునే వాళ్ళకు ఒడ్డున నించోని జేజేలు పలుకుతున్నారు.

నేన్నిర్ఘాంతపోయాను.

"మేమే గొప్ప!" అన్నారు పడవలోని వాళ్ళు నాతో, తమకు చప్పట్లు కొడుతున్నవారికి అభివాదం చేస్తూ.

"మీకు ఈత వచ్చా?" ప్రశ్నించాన్నేను.

"ఏమో ప్రయత్నించలేదు"

"పోనీ ప్రయత్నించి చూడవచ్చుకదా?"

"ఎందుకూ? చేపలు పట్టుకోవటానికి పడవైతేనే అనుకూలం. ఈదుతూ ఒక్క చేపకూడా పట్టుకోలేం"

"అంటే మీరు చేపలు పట్టటం కోసమే వచ్చారా? ఆశ్చర్యంగా అడిగాను.

హేళనగా నవ్వారు.

"మరినువ్వెందుకు వచ్చావేమిటి?"

"ఏమో!? ఈదుదామనిపించింది వచ్చాను. అంతే!"

ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు.

"మంచిది ఈదు ఈదు" ఉచిత సలహా ఇచ్చేసారు నేనెక్కడ చేపలు పట్టటం ప్రారంభించి వారికి పోటీ అవుతానేమోనని.

మళ్ళీ ఈత ప్రారంభించి బయలుదేరుతూ వారిని చూసాను. నేను వెళ్ళిపోయానని భావించి వారు ఒడ్డు వైపు తిరిగి అక్కడ్నుంచి చూస్తున్న జనాలతో "మేమే గొప్ప!" అంటున్నారు.

వెనువెంటనే కరతాళ ధ్వనులు వినపడ్డాయి. నన్నెవ్వరూ గమనించటం లేదు. నన్ను అభిమానించే ఆ నలుగురు మాత్రం చప్పట్లతో నన్ను ప్రోత్సాహిస్తున్నారు. అవినాకు కనపడుతున్నాయి కానీ, వినపడటం లేదు.

మరింత పట్టుదలతో ఈత కొనసాగించాను. అయితే మనసులో భయంగానే ఉంది. నాకు తోడెవ్వరూ లేరు. కనీసం ప్రోత్సాహించేవాళ్ళుగానీ, బాగా ఈదుతున్నావనే వాళ్ళు గానీ లేరు. అంతలోనే మొండి ధైర్యం వచ్చింది. ఈదుతూనే ఉన్నాను. కొన్ని రోజులు గడిచాయి. ఈ మధ్యలో నేను చాలా శ్రమపడ్డాను. కొన్ని చేపలు కనపడి మమ్మల్ని పట్టుకొని వెనక్కిపోయి సుఖంగా ఉండు అన్నట్టు చూసాయి. సముద్రం కూడా నా కష్టానికి జాలిపడ్డట్టు అనిపించింది.

ఓరోజు సాయం సమయానికి నాకు ఏదో అలికిడి వినిపించింది. ఈదుతున్న వాడ్నల్లా ముందుకు చూసాను. నాకు ఎదురుగా ఎవరో కొంతమంది ఈదుతున్నట్లుగా కనపడింది. నాకు భయం వేసింది.

ఇంతవరకు కనపడని వాళ్ళు ఇప్పుడు కనపడటంతో జడుపువచ్చింది. ఆ సమయానికి ఒంటరినైన నాకు తోడు దొరికారన్న ఆనందం మాత్రం కలుగలేదు. వెనుదిరుగుదామని చూసాను. సముద్రం ముందెలా ఉందో వెనక్కీ అలానే వుంది. నా వాళ్ళుకాదు కదా, కనీసం ఒడ్డుకూడా కనపడటంలేదు. నిజానికి అప్పటికే నేను మునిగిపోయానని నిర్ణయించుకొని వాళ్ళు వెళ్ళిపోయారు.

"అబ్బాయ్! ఎవరు నువ్వు? మాలానే ఈదుదామని ఆసక్తితో వచ్చావా?" ప్రశ్నించిందొక గొంతు.

" ఆ. . . .! మరి మీరెవరు?" వణుకుతూ అడిగాను. ఓ క్షణం పాటు అందరూ ముఖముఖాలు చూసుకున్నారు.

"నేను కృష్ణశాస్త్రిని"

"నేను గోపీచంద్‌ని"

"నేను శ్రీ శ్రీని"

"నేను కుటుంబరావుని"

నా కళ్ళ నుండి ఆనంద భాష్పాలు జాలువారాయి. వాళ్ళదగ్గరకు వెళ్ళాలని పించి ఈదబోయాను.

"ఆగాగు! ఎక్కడకీ?"

"ఈదటానికి" అమాయకంగా బదులిచ్చాను.

"ఏం సాధించాలని. . .?"

"మీరు సాధించినదే? ఆత్మ సంతృప్తి"

"మేం సాధించామని ఎలా చెప్పగలవు?"

"ఏమో అలా అనుకోవాలనిపించింది."

కొంతసేపు మౌనం రాజ్యమేలింది. తిరిగి నేనే ప్రశ్నించాను.

"ఇది అనంతమంటారు కదా! నిజంగా ఇప్పటికీ ఎవ్వరూ దీని అంతు తేల్చలేదా?"

"ఏమో! దీని అంతు తేల్చటం ఏ ద్వాపరయుగానికి చెందినవారికి తప్ప మన కలికాలం కవులకు సాధ్యంకాదని మా నమ్మకం!"

"ఠాకూరికి కూడా?" నా అభిమానాన్ని ప్రకటించాను.

"ఏమో మాకు తెలియదు. అతనిది మన భాషకాదు కదా! వారిది వేరే సముద్రం ఐతే అన్ని భాషా సముద్రాలూ అనంతమన్నది వాస్తవం."

"పోనీ మనం ప్రయత్నిస్తే?"

"నువ్వు ఇక ఈదటం కష్టం" కృష్ణశాస్త్రి వైపు నుండి వినపడింది.

"ఈదినా సాధించేది ఏదీ లేదు" గోపీచందు వైపు నుండి వినపడింది.

"అప్పట్లో ఏదో ఆవేశంతో ఈదేశాను" శ్రీశ్రీ గొంతు ఖంగుమంది.

"వెనక్కిపోవటానికి ప్రయత్నించరాదూ?" కుటుంబరావు గొంతు ప్రశ్నించింది.

"ఇది అనంతసాగరం" అన్నారంతా ఒక్కసారిగా.

నాకు చెమటలు పట్టాయి. స్వేదం చెంపలు మీదుగా జారి సముద్రంలో కలిసిపోయింది. చేతులు కంపించాయి. పెదాలు సన్నగా వణికాయి.

*"నిజమే! కాపొచ్చిది అనంతసాగరం*
*"ఐతే మాత్రం ?!"*
*నా ఈత కూడా నిర్విఘ్నమే నిరంతరం"*

అప్రయత్నంగా నా నుండి ఆ మాటలు వెలువడ్డాయి.

అంతా ఓ ఘడియ గంభీరంగా ఆలోచించారు.

"నిన్ను నేను ప్రోత్సాహిస్తాను" - కుటుంబరావు

"అందరం కలిసే ఈదుదాం" - గోపీ చంద్

"మాతో పాటే నువ్వూనూ" - కృష్ణశాస్త్రి

"పదండి ముందుకు, పదండి తోసుకు" - శ్రీశ్రీ

నలుగురూ ఒక్కసారిగా సాదరంగా ఆహ్వానించారు.

ఇప్పుడు నాకు నా ఈతను ఎవరికైనా ప్రదర్శించాలన్న తపనలేదు. అంతకుమించిన ఆనందానుభూతినిపొందాను.

ఉత్సాహంగా వారివైపు ఈతకొనసాగించాను.

*"తెలుగు సాహితి*
*అనంత సాగరం*
*'ఐతే మాత్రం?!?!'*
*నాఈత సైతం*
*నిరాటంకమే నిరంతరం!"*

# పుస్తక ప్రహసనం (కల్పితకథ)

"మొత్తానికి ఎలాగైతేనేం? నేను కలలు గన్న నా పుస్తకం అచ్చయ్యింది." చేతిలోని నా పుస్తకం చూసి తృప్తిగా నిట్టూర్చాను.

ఇప్పుడు ఈ పుస్తకం 'రచయితల సంఘం' కార్యాలయానికి పంపించాల్సి ఉంది. పుస్తకాన్ని కవరులో పెట్టి పార్శిల్ చేసి స్టాంపులంటించా.

"ఇలా రాయకుండా ఉండాల్సిందేమో...?" మళ్ళీ మరోసారి అనుకున్నాను.

"కోపం వస్తే? " ఇంకా ఆ ఆలోచనలు వదల్లేదు.

"రానీయ్! ఇంతవరకు ఎంతమంది పెద్దవాళ్ళ దగ్గర పొగరుబోతుననిపించుకోలేదూ..? వీళ్ళదగ్గరా అంతే!"

సమాధానపరచుకున్నాను.

ఈ పుస్తకం చదివితే ఆ రచయితలు అగ్గిమీద గుగ్గిలంలా ఉగ్రులవుతారని తెలుసు. నా పుస్తకాన్ని చించి చెత్తబుట్టలో వేస్తారనీ తెలుసు. ఐనా ఏంచేయను? నా మనస్తత్వమే అంత! సాకు నచ్చని వాళ్ళని విమర్శించటం నాతత్వం. అందులో భాగంగానే నా పుస్తకంలో ఆ రచయితలను వ్యంగ్యంగా విమర్శించాను. అయితే వాళ్ళను విమర్శించిన కథ 'కల్పిత' మని ఎవరినీ ఉద్దేశించిరాయబడలేదని రాసాను. నాకు తెలుసు పాఠకులు కల్పితం అని రాసినవే నిజంగా జరిగినవని నమ్ముతారని.☆ ఎన్ని సినిమాల్లో చూడలేదూ? వాస్తవ సంఘటనల ఆధారంగా తీసి కల్పితం అన్నమాట బ్రాకెట్‌లో ఉంచటం. అంతేకాకుండా పాఠకులకు ఓ సందేశాన్ని కూడా ఇచ్చాను.

---

☆ ఇది ఈ కథకు కూడా వర్తించిందనుకునేరు? ఈ కథ నిజంగానే కల్పితం ఎవ్వరినీ ఉద్దేశించబడినది కాదు

*"తెనుంగు భాషా చాహకులారా!* ★
*నా సహసాహితీ సహచరులారా!*
*నాక్కొంత*
*చేయూత*
*నివ్వండి!*
*ఈ ఛాందస చాదస్త*
*రచయిత లనెండగడతా" అని*

అసలీ గొడవంతా అర్థం కావాలంటే, దీనికి ముందు జరిగిన సంఘటనలు తెలియాలి. అవి...

* * *

నాకు పద్దెనిమిదేళ్ళు. కొన్నాళ్ళ బట్టీ కథలూ అవీ రాసాను. వాటిని పుస్తక రూపంలో చూసుకోవాలని ఎంతో తాపత్రయపడేవాడిని. ఆ ప్రయత్నంలో భాగంగానే ఓ పేరున్న గొప్పరచయితను కలిసాను. నా రచనలు చూపి ఆయన అభిప్రాయం తెలుసుకోవటానికి.

ఆయన నేను రాసిన ఓ కథలోని రెండులైన్లు చదివి

"ఫరవాలేదు! చదివించేగుణం అగుపడుతోంది" అని కాంప్లిమెంట్ ఇచ్చాడు. తరువాత ఆయనే-

'మా సంఘం ఇక్కడ కొత్త రచయితలను ప్రోత్సహించే బృహత్తర కార్యం రూపొందించింద'ంటూ వారి సంఘం ముచ్చట్లు చెప్పాడు.

"నీ కథలు చదివి రేపు అభిప్రాయం చెప్తాను. రేపు జరగబోయే మా సమావేశానికి హాజరుకా" అని అన్నాడాయన.

మహదానంద పడిపోయాను.

---

☆ ఈ చాహకులు అనే పదం సరియైనదో, కాదో నాకు తెలియదు. ప్రాస కోసం ప్రయోగించాను. హిందీ చాహత్ (ఇష్టం) మూలముగా తీసుకొని ప్రయోగించినది.

మరసటిరోజు వారి సమావేశానికి హాజరయ్యాను. ఆ పెద్దాయన ఓ పెద్ద కుర్చీలో, మిగిలిన వారంతా చిన్న కుర్చీల్లో కూర్చున్నారు.

ముందు కొంతసేపు (ఓ గంటన్నర) కథలెలా రాయాలన్న విషయమై అంతంత అనుభవం సంపాదించాక కూడా చర్చించుకున్నారు. అయితే దానికి అందంగా ' కథాశిల్పం - చర్చ' అని పేరు పెట్టుకున్నారు.

"గొప్ప రచయితలింతే కాబోలు. తమ రచనల్ని పదునుపెట్టుకుంటారు" అనుకున్నా.

పెద్దాయన నా కథలు చదివారేమోనని ఆశతో వారిని అదే అడిగాను.

"ఉహూ! తీరిక లేదబ్బాయ్! చదవలేదు. నువ్వే గొప్పదనుకున్న ఓ కథ చదివివినిపించు" అన్నాడాయన. ఒక రోజంతా నా రచన ఉంచుకొని చదవలేదనటంతో కాస్త చిన్న బుచ్చుకున్నాను.

"గొప్ప రచయితలింతే కాబోలు! తీరిక ఉండదు" సర్దిచెప్పుకున్నాను.

కూర్చున్న మిగిలిన రచయితలంతా కుర్రాడ్ని మనమే ప్రోత్సాహించాలన్నట్టుగా మాట్లాడి నన్ను ముందు చదవమన్నారు. నేను నా పరిసరాలను మరిచిపోయి మరీ ఓ కథ చదివాను. ఎవ్వరూ మాట్లాడలేదు. నా కథపై ఎవరైనా అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తారేమోనని చూసాను. ఉహు! నిరాశే ఎదురైంది.

మరొకాయన అతను రాసిన కథ చదివి వినిపించాడు. భార్యాభర్తల అలకలపై రాసిన కథ అది. నాకు అది ఎందుకు రాసాడో, ఏం చెప్పదలచుకున్నాడో అర్థం కాలేదు. ఐతే అలాంటి అర్థం పర్థంలేని రచనలు కూడా చెయ్యొచ్చని అప్పుడే తెలిసింది.

తరువాత మరొకాయన ఓ సామాజిక సమస్యపై అసహజమైన వర్ణనలతో, అసందర్భమైన ఆవేశాలతో ఉన్న కథ చదివి వినిపించాడు.

" గొప్ప వాళ్ళింతే నా బోటివారి తలకెక్కరు" అనుకున్నా.

మరొకాయన ఒక రాజకీయ సమస్యపై కథ చదివి వినిపించాడు. నిజం చెప్పొద్దూ? అది నిజంగానే నాకు నచ్చింది. "బాగుంది" అనుకున్నా! (ఇదో పెద్ద జోకు. అప్పటికే ఓ స్థానాన్ని సంపాదించుకున్న ఆ పెద్ద రచయితల కథలను నేను విశ్లేషించటం.)

కథలు ముగిసాయి. ఇక చర్చ మొదలయ్యింది. పెద్ద కుర్చీలో కూర్చున్న పెద్దాయన నా వైపునకు తిరిగి "అబ్బాయ్ ఏదేమైనా నువ్వనుకున్నట్టు నీలో శ్రీశ్రీ అంతటి ప్రతిభ ఏ

కోశానా....."

అతని మాట పూర్తవ్వక ముందే నేను నిశ్చేష్టుడనయ్యాను. నన్ను శ్రీ శ్రీతో పోల్చవలసిన అగత్యం ఎందుకు ఏర్పడిందో అర్థం కాలేదు. నేనొక కథలో నన్ను నేను శ్రీశ్రీతో పోల్చుకోవటం వాస్తవమే. అయితే నా కథలేవీ చదవలేదన్న ఈయనగారికి ఈ విషయం ఎలా తెలిసినట్టు?

ఈ ఆలోచనల్లో ఉండి ఆయన చెప్పింది పూర్తిగా వినలేదు. "... అంచేత మేం చెప్పేదేమిటంటే నీలో స్థాయి ఏమాత్రమూ లేదు. మాలాంటి వారి సహచర్యంలో కొంత అనుభవాన్ని సంపాదిస్తే రాయగలవు. మా సభలకు హాజరవుతూ, మా సలహాలు పాటిస్తే రచయితవు కాగలవు..." చెప్పుకుంటూ పోతున్నాడు పెద్దాయన.

నాకంతా అయోమయంగా ఉంది.

'ఇది మరీ దారుణం. నాలో స్థాయిలేనప్పుడు వారి సహచర్యంలో మాత్రం ఎలా రచయితను కాగలను? ఒక వేళ అయినట్లయితే అందుకు నేనే ఏముంది? ఎవ్వరైనా రచయిత కావచ్చుగా? ఆరుకోట్ల ఆంధ్రులందరూ రచయితలయిపోతారు.

"మీరు అనుమతిస్తే మరొక గల్పిక చదువుతాను" వినయంగా అడిగాను నా ప్రతిభ ప్రదర్శించుకోవటానికి.

"తప్పకుండా! ముందు మిగిలిన వారి కథలను సమీక్షించనీయి" పెద్దాయనన్నాడు.

మిగిలిన కథల సమీక్షా ప్రహసనం జరిగాక పెద్దాయన "ఇక సమయం అయ్యింది. మనం శెలవు. . ."

"అనుమతిస్తే నేనొక గల్పిక చదువుతాను" మర్చిపోయారేమోనని గుర్తుచేసాను.

"తప్పకుండా" ("తప్పుతుందా" అన్న భావం స్ఫురిస్తూ) అంటూ కాసేపు ఏవోరెండు ముక్కలు మాట్లాడి -

"ఇక శెలవు తీసుకుందాం" అన్నాడాయన.

నాకాక్షణం నాలో విదూషకుడు కనిపించాడు. అదేదో సినిమాలో ఒక నటుడు కనపడిన వాళ్ళనందరినీ కథలు చదివి వినిపిస్తానని కాల్చుకుతింటాడు. అతనికి నేనేం తక్కువ?

వెళ్ళిపోయే ముందు పెద్దాయన మరొకరిని పరిచయం చేసి " నీ రచనలను వీరికివ్వు.

చదివి స్థాయి నిర్ణయిస్తారు" అన్నాడు.

"నా వ్రాత అంత బాగా ఉండదు. ఈసారి గుండ్రంగా రాసి తెస్తా" తప్పించుకున్నాను.

శెలవు తీసుకొని ఓ వారం తరువాత రాజకీయ సమస్య పై కథరాసినాయన్ని కలుసుకుని నా పుస్తక ప్రచురణకై ఆయన అభిప్రాయాన్ని అడిగాను.

"ఇప్పుడెందుకీ హాడావుడీ...?" అన్నాడాయన.

నాకు చాలా సేపు ఆ హడావుడి మాటకు అర్థం, అర్థంకాలేదు.

"నీకు స్థాయిలేదు. మాలాంటి వారి సహచర్యంలో కొన్నాళ్ళు గడిపినేర్చుకో" సలహాఇచ్చాడు.

అప్పుడర్థం అయ్యింది 'హడావుడి' మాటకు అర్థం.

నాకు నేర్చుకొని ఈ రంగంలోకి రావాలని లేదు. ఆ పాటి ప్రయత్నం అందరూ చెయ్యగలరు.

"నీ వ్రాత ప్రతినిలా ఇవ్వు. చదివి అభిప్రాయం చెబుతా" అన్నాడాయన.

'ఒక్కటీ చదవకుండానే స్థాయిలేదని నిర్ణయించేశారు కదా! ఇంకేముందు అభిప్రాయం చెప్పటానికి'

"నా వ్రాత అంత బాగా ఉండదు. ఈ సారి గుండ్రంగా రాసి ఇస్తా" తప్పించుకున్నాను.

ఆ రోజే నిశ్చయించుకున్నాను పుస్తకం అచ్చేయించాలని.

అయినా మనసుండబట్టుకోలేక ఆ సంఘంలో మరో రచయితను కలిసాను.

నేను చెప్పింది విన్నాక ఆయన...

"నీకో సలహా ఇస్తాను. నీ స్థానంలో నేనుండి నాకా సలహా ఎవరైనా ఇచ్చినా నాకది నచ్చదు. కానీ అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు "అంటూ మొదలెట్టాడు.

"పుస్తకమంటే ఖర్చు పదిహేను వేలకి నయాపైసా తగ్గదు..." చెబుతున్నాడాయన

"హమ్మో నేనేదో ఆరేడు వేలకి అయిపోతుందనుకున్నా!"

"నీలో తృష్ణ ఉంది. కానీ ఇంకా స్థాయి రాలెదు." చెప్పాడాయన.

నేనాయన్ని నమ్మేసాను.

"నిజమే నాకు తృష్ణ ఉండి. కానీ స్థాయి లేదు. ఈ రంగానికి నేను పనికిరాను" నిశ్చయించుకున్నాను.

ఇంకానయం ఈయన్ని కలిసాను. లేదంటే ఆ స్థాయిలేని పుస్తకాన్ని అచ్చేయించేసి ఉండేవాడ్ని.

అంతే ఆ తర్వాత నేను రచనల గురించి పూర్తిగా మర్చిపోయాను. అయితే అనుకోకుండా కొన్నాళ్ళుకు ఒక ప్రెస్సు ఉన్న మిత్రుడ్ని కలుసుకున్నా. మాటల సందర్భంలో నేననుకున్న పుస్తకానికి అయిదారు వేలయితే సరిపోతాయని తెల్సింది. అంతే నేను గుడ్డిగా నమ్మిన రచయిత పై అనుమానం మొలకెత్తింది. దాంతో పాటుగా మళ్ళీ నా స్థాయిపై నమ్మకం పెరిగింది.

నెమ్మదిగా పరిస్థితులను అర్థం చేసుకున్నాను. నేటి రచయితల భావాలు ఎంత నూతిలో ఉన్నాయో తెలుసుకున్నాను. వాళ్ళ ఆలోచనలు కూడా నూతికి పరిమితమవ్వటం వల్ల విస్తృతమైన నా కథలకు వాళ్ళు స్పందించలేకపోయారని బోధపడింది.

"ఇంకెన్నటికీ వాళ్ళు నన్ను ఒప్పుకోరు" ధృఢంగా నిశ్చయించుకున్నాను.

అదేదో కథలో బ్రాహ్మడు ఆవు తీసుకుపోతుంటే పందని చెప్పి నమ్మించిన దొంగల్లా రచయితలు ఆ బ్రాహ్మడిలా నన్ను ఊహించుకున్నాను. నవ్వుకున్నాను.

పుస్తకం ప్రచురణ అయ్యింది.

ఇదీ దీని వెనుక కథాకమామీషు!

* * * *

పుస్తకాన్ని రచయితల సంఘం కార్యాలయానికి పంపాను.

నేను రాసిన కథలో వారిని విమర్శించిన తీరు చదివారు.

"హు కుర్రకుంక! ఎంత పొగరు" అన్నాడొకాయన.

"మన కాలిగోటికి సరిపోడు వెధవ! మనల్ని విమర్శిస్తాడా?"

"అసలు వీడికి స్థాయేదండీ? వీడొక రచయితటండీ...?"

"పైగా కల్పితమని రాసాడు. మనం భుజాలు తడుముకోవటానికి"

"వీడికే చేతనవునా? నేనూ ఇప్పటి కుఱ్ఱ రచయితల వెఱ్ఱి తీరుపై ఎండగట్టి వ్యాసం రాస్తా" పెద్దాయన అన్నాడు.

" ఆ మాత్రం దానికి మీరెందుకండీ మేం చాలమూ? మా చతురతతో వాడ్ని ఎలా ఏకిపారేస్తామో చూడండి"

"ఇంటికి పిలిపించి దులిపేయాలివాడ్ని"

"దీన్ని . . . . దీన్ని. . . ."

ఆవేశంతో మాట మొదలుపెట్టిన ఒకాయన తర్వాత ఏమనాలో మర్చిపోయాడు.

". . . . ఇదీ దీని స్థానం"

నా పుస్తకం చెత్త బుట్టలో వేస్తూ మాట కూడా పూర్తి చేసాడతడు.

అందరూ తృప్తి పడ్డారు.

ఆ గదిలో గోడకు వేలాడదీసిన ఓ మహారచయిత ఫోటోలోని అతని చేయిమాత్రం, అంతవరకూ చెంపమీద ఉన్నదల్లా కొంచెం సవరించుకొని ముక్కున వేలేసుకుంది.



# ఘోష

అతను ఒంటరిగా కూర్చొని ఉన్నాడు. నిశ్చలంగా ఉన్నాడు. సూర్యుడు వచ్చేటప్పుడు నిర్లిప్తంగా చూస్తున్నాడు. చంద్రుని వైపు నిరాశగా చూస్తున్నాడు. ఏ భావమూ పలికించని నిస్పృహ నిండిన వదనంతో తన తల్లిని తలపైకెత్తి చూస్తున్నాడు.

ఒకప్పుడు తనకు తోడెవరైనా వస్తారేమోనని ఉవ్వెత్తున ఎగసేవాడు. పగలు, రాత్రి, వెలుతురు, చీకటి అన్ని సమయాల్లోనూ, చూపు ఆనినంత దూరం, భూమి అంతమైన వరకు ఎవరైనా వస్తారేమోనని ఆశగా చూసేవాడు. నెమ్మదిగా ఎవరూరారని నిశ్చయించుకొని నిశ్చలమైపోయాడు. ఎప్పుడో చలించినా యాంత్రింకంగా చలిస్తాడు. అతని పరిస్థితి చూసి తల్లి ఆకాశం కన్నీళ్ళు పెట్టుకున్నది.

ఓ రోజు ఓ అందమైన సుందరి అతని వద్దకు వచ్చి ఆమడ దూరాన నించోని పిలిచినది.

అతనా సమయానికి నిరాశ నిండిన కళ్ళతో, తన ముఖాన్ని మోకాళ్ళల్లో దాచుకొని ఉన్నాడు.

"ఓయీ. . . .!" పిలిచినదామె.

". . . . . . . . . ."

"మిత్రమా. . . .!" మళ్ళీ పిలిచినది.

పలుకనే లేదు.

"ప్రియా. . . .!"

కళ్ళు తెరిచాడతడు. ఎదురుగా మనోహరమైన రూపంతో సోయగాలు ఒలికిస్తూ, స్వేచ్ఛగా ఎగురుతూ, అనంతం వరకు పరచి ఉన్న శిరోజాలను, తన మృదువైన అరచేతితో ప్రక్కకు తొలగిస్తూ 'దేవకన్యయా?' అనిపించేంతటి వర్చస్సుతో ఉన్నాదామె.

ఎన్నాళ్ళ క్రితమో అడుగంటిన ఆశ తిరిగి చిగురించినదతనిలో.

"సుందరీ - నీ వెవరవు? ఎచట నుండి వచ్చినావు?" ప్రశ్నించాడతడు.

మంచు కొండల మలుపుల్లో మానస సరోవరాన పుట్టి, మనసిచ్చే వాని కోసం వెదుకుతూ వచ్చినాను" బదులిచ్చినదామె.

"ఒంటరిగా వచ్చినావా? భయంలేదూ. . .?" తిరిగి ప్రశ్నించాడు.

"భయమేల? నా బంధువులందరూ దారిపొడుగునా వెన్నంటినారు కదా" తాను దాటిన పర్వతాలను జ్ఞప్తికి తెచ్చుకుందామె.

"ఇంతకి నీ పేరు చెప్పనే లేదు" గుర్తుచేసాడు.

"యమున"

". . . . ."

"నీ పేరు?"

". . . . తెలియదు. . . . ఇంత వరకూ ఎవ్వరూ పిలువనే లేదు" అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆమె జాలిపడింది.

"నేను సాగర్ అని పిలుస్తాను. సరేనా?"

అతడు ఆనందించాడు. మునుపటి ఉత్సాహం, చైతన్యం అతనిలో ప్రవేశించాయి. ఉవ్వెత్తున ఎగసాడు. తన ఆనందాన్ని తల్లి అంబరానికి చెప్పాడు. సూర్యుడు వచ్చినంతనే అతని చెవిలో చెప్పాడు. చంద్రునితోనూ, చీకటితోనూ, చుక్కలతోనూ చెప్పాడు. మబ్బులకు చెప్పాడు.

ఆమె నవ్వుకుంది.

వారిద్దరూ కబుర్లాడుకున్నారు. చెలిమి చేసారు. పరస్పరం ప్రేమించుకున్నారు. కొన్ని రోజులు గడిచాయి.

ఒకనాడతనికి ఆమెను స్పృశించాలన్న కోరిక కలిగింది.

"సఖీ. . . " పిలిచాడు.

"ఊ. . . .!" కలలోంచి పలికినట్లుగా తన్మయంగా బదులిచ్చిందామె.

"మన ప్రణయానికి గుర్తుగా ఈ ఉంగరం నీ వేలికి తొడగనీయవూ. . .?"

అర్థించాడతడు.

మౌనంగా చేయినందించిన దామె.

తనలో దాచుకున్న ఓ అద్భుత ముత్యపుటుంగరాన్ని ఆమె వేలికి తొడిగి ఆమె అరచేతిని చుంబించాడు.

ఆమె సిగ్గుపడింది. అరచేతిని వెనక్కి తీసుకోవటానికి యత్నించినది.

అతడు విడువలేదు. విడిస్తే తనను విడిచి పోతుందని అతని భయం. అతని చర్య ఆమెకు చీకాకు తెప్పించింది. అతడు తన మిగిలిన చేతులను చాచి కౌగిలిలోనికి రమ్మని ఎంతగానో ఆహ్వానించాడు. ఆమె నిరాకరించినది.

అతడు నిరాశ చెందాడు. ఆమె ఈసడించుకొన్నది. అయినా ఆతడామె చేతిని వదలలేదు. నెమ్మదిగా అతనిలో కాఠిన్యం ప్రవేశించింది. కర్కశంగా ఆమె చేతిపై పట్టు బిగించాడు. యమున.విలవిలలాడింది. కన్నీళ్ళు పెట్టుకున్నది . కానీ అతని పరిష్వంగంలోనికి రాలేదు.

అంబరం వారివైపు గంభీరంగా చూసింది. గుడ్లురిమింది. ఆమెనతని కౌగిలిలోనికి పొమ్మన్నది.

యమున మళ్ళీ నిరాకరించినది.

అంబరానికి కోపం వచ్చింది. తుఫాను సృష్టించింది. విధిలేక యమున అతని కౌగిలిలోనికి పోయినది. అతని కోరిక నెరవేరింది. అంబరం శాంతించింది. యమున వెనక్కి మరలింది. అయినా అతడామె చేతిని విడువలేదు.

ఆమె మౌనంగా విలపించింది.

కొన్నాళ్ళు గడిచాయి.

ఒకనాడతడు తనవైపు మరో మగువ రావటం గమనించాడు. ఆమె మరింత అందంగా యమున కంటే సుందరంగా ఉన్నది. మరింత పరిణితి చెందిన మనస్కురాలి వలే విశాలంగా ఉన్నది.

అతడు యమునను ఆమెకు కనపడనీయకుండా వేరే చేతిలోనికి మార్చాడు.

"సుందరీ నీవెవరవు?" ప్రశ్నించాడతడు.

"గంగను" బదులిచ్చినదామె.

"నీ పేరేమిటి?" తిరిగి ప్రశ్నించినది.

". . . . ఏమో. . . .? ఇప్పటివరకూ ఎవ్వరూ పిలువనే లేదు" కళ్ళు చెమర్చాడతడు.

ఆమె జాలిపడింది.

"నేను సాగర్ అని పిలుస్తాను. సరేనా?" అన్నదామె.

అతను ఉలిక్కిపడ్డాడు. అంతలోనే తమాయించుకొని

"నీ వెచట నుండి వచ్చినావు? నీ తల్లిదండ్రులను విడిచి వచ్చుటకు కారణమేమి?" ప్రశ్నించాడతడు.

"కాశ్మీర రాజ్యం నుండి వచ్చినాను. హిమగిరులయందు పుట్టినాను. వారు కన్న బిడ్డనే! వయసొచ్చాక మనసిచ్చే వానికోసం అన్వేషిస్తూ వచ్చినాను" బదులిచ్చినదామె.

అతడానందించాడు. ఆమెకు తీయని కబుర్లు చెప్పాడు. తనలో ఇముడ్చుకున్న వింతలను వెలుపలకు తీసి చూపాడు. నెమ్మదిగా ఆమెను వశపరచుకున్నాడు. ఉంగరం పెట్టె నెపంతో ఆమె చేయినందుకున్నాడు. ఆమె సిగ్గుపడింది. బుగ్గలు ఎరుపెక్కాయి. అతడు ఆమె చేతిని చుంబించాడు. ఆమె వెనక్కి లాక్కోబోయింది. కాని అతడామె చేతిని ఎంతకీ విడువక పోవటంతో ఆ సిగ్గు కాస్తా కోపంగానూ, అసహ్యంగానూ, ద్వేషంగానూ మారింది.

అతని కౌగిలిలోనికి రావటానికి నిరాకరించింది.

ఆకాశం ఉరిమింది. ప్రళయాన్ని తెచ్చింది.

అయినా ఆమె చలించలేదు.

గగనం ఉప్పెనను తెచ్చింది. అతడామెను కబళించాడు. అసహాయ స్థితిలో మూగగా రోదించినదామె.

నింగి శాంతించింది. అతడు వెనక్కి మరలాడు. ఆమె చేతిని మాత్రం వదల్లేదు. అప్పటి నుండి అతడు ఎందరో స్త్రీలను లోబరుచుకోసాగాడు. ముందుగా బలయిన వారు ఏమీ చేయలేక దీనంగా చూస్తున్నారు. అతడెవ్వరిని విడువటం లేదు. వారెవ్వరూ అతని కౌగిలిలోనికి పోవటం లేదు. అతడి కోరిక గమనించినప్పుడు అతడి తల్లి వారిని భయపెట్టి

ఏకం చేస్తోంది. వారందరికీ సంతానం కలిగింది. ఆ సంతతికి జరిగిన దారుణం తెలుసు. వారు తమ తల్లిని ఎప్పుడు విడువరు. అతడి పాలపడ్డ అంగనల జీవితాల్లో యాంత్రికత చోటు చేసుకోంది. మునుపటి ప్రేమలు లేవు. మునుపటి ఆత్మీయతలు లేవు. మునుపటి అభిమానాలు లేవు. ఆశలు లేవు. అతృత లేదు. అతడు చేతులు చాచి వారిని తన కౌగిలిలోనికి రమ్మని కవ్విస్తున్నాడు. అది కూడా యాంత్రికంగా ఉంటుంది. హేళన చేస్తున్నట్లు ఉంటుంది. బానిసను పిలిచినట్లుగా ఉంటుంది. అతని మాయలో పడ్డ పడతులందరికీ ఈ విషయం తెలుసు. అయినా అతని చేతిలో నుంచి తమ చేతిని విడిపించుకోలేని దీనస్థితిలో అనుక్షణం కుమిలిపోతూ, ఆ యాంత్రిక జీవనానికి అలవాటు పడ్డారు.

వారి కంఠ ధ్వనుల, ఆర్తనాదాల ఘోష ఇప్పటికీ అతని చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటుంది.



# దానవుని జీవనం

దేవతలు, రాక్షసులు తాంబూలాలు పుచ్చుకున్నారు. పెళ్ళి నిశ్చయించారు. నిజానికా సంబంధం దేవతల తరపు వాళ్ళకి ఇష్టం లేదు. కానీ వేరే దేవతల సంబంధం చేసే స్థోమతలేక, రాక్షసులకట్నం తక్కువ కావటం చేత ఒప్పుకున్నారు.

దేవతకి, రాక్షసునికి పెళ్ళైయిపోయింది. దేవతంటే ఆమె నిజంగా దేవతే. అలా అని ఆమెకు గొప్ప ఆదర్శాలు గానీ, విలక్షణ వ్యక్తిత్వం గానీ, ఒకళ్ళని ఉద్ధరించే గుణం కానీ ఉన్నాయనుకోకూడదు. ఆమె చాలా అమాయకురాలైన దేవత. వెన్నపూసలాంటి మనసున్నది. ఎదుటి వారిలో ఎంతటి తప్పునైనా క్షమించగలిగేది. ఆమె రాక్షసునితో వివాహమనగానే తల్లికి ఎదురుచెప్పలేదు. చిన్నప్పుడే తండ్రిపోయిన తనకు తల్లి అంతకంటే ఎక్కువ కట్నం ఈయలేదని గ్రహించింది. అదీ గాక ఆమెకు తల్లిని ఎదిరించటం తప్పని తోచింది. అలా అని లోలోన బాధపడనూ లేదు. ఒక వేళ బాధపడినా, తాళిపడ్డ మరుక్షణం ఆ బాధను మరచిపోయింది. పతియే ప్రత్యక్ష్య దైవం అనుకుంది.

రాక్షసుడు కూడా, రాక్షసుడంటే నలుగురికి కష్టాలు కలిగించేవాడో, ఎదుటి వారికి కీడుతలపెట్టే వాడోకాదు. అతను ఇతరుల జోలికే పోయేవాడుకాదు. కానీ అతనిలో రాక్షస సాంప్రదాయాలు మూర్తీభవించి ఉన్నాయి. అతనికి హృదయం లేదు. హృదయం లేదంటే కఠినాత్ముడు అనుకోకూడదు. హృదయం బండరాయంటే కఠినాత్ముడు కానీ, హృదయం లేదంటే కఠినాత్ముడని అర్థం ఎలా వస్తుంది? అతనిలో మృగ చేష్టలు ఎక్కువగా కనపడతాయి.

ఆమెకు రాక్షసుని వికృత చేష్టలెన్నో బాధ కలిగించినై. రాక్షసుడు గట్టిగా అరిచినట్లు మాట్లాడేవాడు. భాష కూడా జుగుప్సకరంగా ఉండేది. నవ్వితే బండరాళ్ళు కురిసినట్లు ఉండేది. పళ్ళు వికృతంగా ఉండేవి. శుభ్రంగా ఉండేవాడు కాదు. తినేటప్పుడు అసహ్యకరమైన లొట్టలు చప్పుడు వినబడేది. తైల సంస్కారం లేని తలగోక్కుంటూ ఉండేవాడు. పెళ్ళైన కొత్తలో రాక్షసులతోనే గడుపుతూ ఆమెను దూరంగా, వేరుగా ఉంచేవాడు. ఆమె అన్నిటికీ ఓర్చుకుంది. భర్త వైఖరిలో మార్పు తేవటానికి ప్రయత్నించేది. కొంచెం కొంచెం పరివర్తన అతనిలో కలిగేది. ఆమెతో బాగానే కాపురం చేసేవాడు. కానీ తన రాక్షసుల మధ్యకుపోయే సరికి రాక్షసుడైపోయేవాడు. రాక్షసుల మధ్యకు వెళ్తే రాక్షసులను తన వారిగానూ, దేవతలను పరాయి వారిగానూ భావించేవాడు. తన వారు

తనకు మంచి చేస్తారని నమ్మేవాడు. మిగిలిన రాక్షసులు అతడ్ని దేవతలతో చేరి చెడిపోయావనేవారు. అతడు బుఱ్రూపేవాడు. 'పట్టి వాజమ్మ' కింద తయారయ్యావనే వారు. దానికీ బుఱ్ర ఊపేవాడు.

దేవత దగ్గరకు వచ్చి ఓ రెండ్రోజులు ఆ ద్వేషాన్ని వెళ్లగక్కేవాడు. మళ్ళీ అంతలోనే దేవత విలువ తెలుసుకొని బుద్ధిగా మసలేవాడు. దేవత అతడ్నెప్పుడూ కించపరచలేదు. అతని తప్పులను తనపై వేసుకొని చూపరులకు దేవతదే తప్పన్న భావన కలిగించేది. అతడు కూడా తన తప్పులను దేవతపై రుద్ది ఆమెదే తప్పన్న భ్రమ కలిగించేవాడు. తన సంపాదనంతా రాక్షసులకు ధారపోసేవాడు. ఐనా దేవత ఎదురు చెప్పలేదు. రాక్షసులను కూడా తన వారిగా భావించగలిగే ఉన్నత మనస్తత్వం ఆమెది.

దేవత తన భర్త ప్రవర్తన మార్చటానికి నానాతంటాలు పడేది. కొంతవరకు విజయం సాధించింది కూడా. ఎందుకంటే రాక్షసుడు దేవత సాంగత్యంలో రాక్షసునిలా ఉండేవాడుకాదు. మనసున్న వాడిలా మసలేవాడు. కానీ అంతలోనే రాక్షసుల సహచర్యంలో రాక్షసుడైపోయేవాడు. దేవత లక్ష్య సాధనలో ఎన్నో కష్టాలు అనుభవించింది. ఆమె గుణాలు కొన్ని రాక్షసునికి అలవడి అతడు మంచివాడైనా, అతని గుణాలు కొన్ని ఆమెకు అబ్బాయి. రాక్షసుల మూర్ఖత్వం కొంతమేరకు ఆమెకు అలవడింది. ఐనా ఆమె దేవతే! వజ్రాన్ని కొంత అరగదీసినంత మాత్రాన వజ్రం కాకపోతుందా? పాపం ఆమె మాత్రం ఏం చేస్తుంది.? ఆమె ఆమాయకురాలు. ఎలాంటి పరిస్థితులల్లోనూ కూడా దుర్గుణాలను దరిచేరనీయనంతటి, ధీరోదాత్తురాలూ, ఆదర్శవంతురాలూ కాదు. అసలామెకు ఆదర్శాలే లేవు. కానీ ఆమె దేవతే! ఎందుకంటే ఆమె మనసు వెన్నపూస. కాదు మంచుగడ్డ.

రాక్షసునికి, దేవతకి మొదట ఓ కొడుకు పుట్టాడు. అయితే కొద్దికాలమే బ్రతికి ఏడాదికే పోయాడు. బహుశా పరస్పర విరుద్ధ స్వభావంగల రాక్షసునికి, దేవతకి పుట్టడం వల్ల కాబోలు, కొద్ది కాలమే జీవించగలిగాడు. దేవత కుమిలిపోయింది. భోరున విలపించింది. రాక్షసుడూ ఏడ్చాడు. కానీ ఎందుకు ఏడ్చాడో అతనికి తెలియదు. భార్య ఏడుపు చూసి అతనికి కన్నీళ్ళు వచ్చాయి. అంతే!

కొన్నేళ్ళకు వారికి మరో సంతానం కలిగింది. ఈ సారి భగవంతుడు బాగా ఆలోచించి పూర్తి రాక్షసపుత్రికనే పుట్టించాడు. రాక్షసులంతా పండుగ చేసుకున్నారు. తమ రాక్షస సోదరుణ్ణి అభినందించారు. దేవతకు రాక్షసపుత్రిక కలిగినందుకు బాధ కలుగలేదు. ఎందుకంటే రాక్షసుడు ఆనందపడ్డాడు కనుక. సంతోషమూ కలుగకపోయినా ఆమె భర్త

ఆనందాన్ని పంచుకొంది.

రాక్షస పుత్రి రెండేళ్ళదయ్యింది. ఆమెకు అచ్చం రాక్షస వంశ గుణాలే వచ్చాయి. రాక్షసుడి ముద్దుల కూతురయ్యింది. పోలికలో కూడా తండ్రిలాగానే ఉండేది.

మరొక ఏడాదికి వారికి మరొక సంతానం కలిగింది. ఈ సారి దేవపుత్రుడు జన్మించాడు. దేవత మురిసిపోయింది. రాక్షసుడూ మురిసాడు. ఎందుకంటే అతనికి దేవతల విలువ తెలుసు. కానీ రాక్షసుల మధ్య చేరితే ఆ విలువ అతడు మర్చిపోతాడు.

పిల్లలిద్దరూ పెరిగి పెద్దవారయ్యారు. రాక్షసుని ప్రవర్తనలో మార్పులేదు. దేవత దగ్గర ఒక రకంగా, రాక్షసుల మధ్య ఒక రకంగా ప్రవర్తించే వాడు. రాక్షసులు ఇప్పటికీ అతన్ని 'వాజమ్మ' అనేవారు. అతడు బుర్రూపేవాడు. కానీ వాళ్ళ దగ్గరకు వెళ్ళటం మానలేదు. తన వాళ్ళని, రక్త సంబంధీకులని ప్రేమ. హృదయం లేనివాడికి తన జాతిపై మాత్రం ప్రేమ ఎలా వచ్చిందంటే సమాధానం చెప్పలేం. రక్త సంబంధం కనుక ఆ ప్రేమ రక్తంలోనే ఉందనుకోవాలి.

అదేంటో గానీ, రాక్షసుడు దేవతను విడిచి రాక్షసుల మధ్యకుపోయి ఎన్నిరోజులైనా ఆనందంగా గడపగలిగే వాడు. కానీ అతడ్ని విడిచి దేవత ఒక్క క్షణం గడపదాటినా ఉండలేకపోయేవాడు. ఎప్పుడైనా ఆమె పుట్టింటికి వెళితే, దేవత లేని తన ఇంట్లో పిచ్చాడైపోయేవాడు. అలాంటప్పుడే అతనికి దేవత విలువ తెలిసొచ్చేది.

పిల్లలు పెద్దవారయ్యారు. రాక్షసపుత్రిని చూసి రాక్షసులు గర్వపడేవారు. రాక్షసుడూ గర్వపడినా అతడు తనకు దేవపుత్రుడు జన్మించినందుకు కూడా ఆనందపడేవాడు. మిగిలిన రాక్షసులకు ఆ ఆనందం లేదు. వారికి రాక్షసకుమారుడైతేనే బాగుండుననిపించింది. రాక్షసుడు మాత్రం ఇద్దరి మీదా మమకారం పెంచుకున్నాడు. ఇది కూడా రక్తసంబంధమే కనుక, ఆ ప్రేమ కూడా రక్తంలోనిదే.

దేవపుత్రుడిది విలక్షణ వ్యక్తిత్వం తన తల్లికున్నంత కరుణ అతనికి లేదు. నిజానికి అంతటి కరుణ, దయ ఉండకూడదని అతని విశ్వాసం. అతనివి చాలా విశాల భావాలు. ఉన్నత ధృక్పధంతో ఆలోచించేవాడు. అతనికెంతో ఆదర్శవంతమైన ఆశయాలున్నాయి. తన ఆశయసాధనలో దుష్టుల మనస్సు నొప్పించటానికైనా వెనుకాడేవాడుకాదు. అతనికి తండ్రి ప్రవర్తన నచ్చలేదు. తల్లి మామూలు దేవతలాకాక దేవతలకే దేవతలా కనపడింది. తండ్రికి హృదయం లేదని, రంగులు మారుస్తాడని తెలుసుకున్నాడు. అయితే ఆ రంగులు

మార్చటంలో తండ్రికి స్వార్థం లేదని గ్రహించాడు.

రాక్షసునికి మాత్రం పుత్రునిపై విపరీతమైన ప్రేమ. ఆ విషయం దేవకుమారునికి కూడా తెలుసు. అందుకే తండ్రిని ఈసడించుకోవాలనుకున్నా ఆ పని చేయలేకపోయేవాడు. తండ్రి మనసు నొప్పించే సాహసానికి ఒడిగట్ట బుద్ధికాలేదతనికి.

అయితే తండ్రి సాంగత్యం వల్ల తల్లిలో వచ్చిన మార్పు అతడు సహించలేకపోయేవాడు. తల్లిపై విసుగును, కోపాన్ని ప్రదర్శించేవాడు. ఆమె తప్పులు ఎత్తి చూపేవాడు. పాపం ఆమె మాత్రం ఏం చేయగలదు? దుర్గుణాలు ప్రవేశించకుండా నిరోధించడానికి, ఆమెకు కొడుక్కున్నంత సునిశిత దృష్టి, ఆలోచనా సరళి, ఆదర్శ భావాలూ లేవు. కొడుక్కున్నంత విలక్షణ వ్యక్తిత్వం, పరిజ్ఞానం ఆమెకు లేవు. కానీ కొడుకు గుండె కంటే వెన్నపూసలాంటి మనసున్నది. అందుకే ఆమెలో దైవత్వం పోలేదు.

రాక్షస పుత్రి వివాహం జరిగింది. దేవపుత్రుడు ఒక రాక్షసమూర్తి తమ ఇంటి నుండి కదిలిందని ఆనందించాడు. దేవత మాత్రం కూతురిని విడిచిపెట్టాల్సివచ్చిందని ఏడ్చింది. అదీ తల్లి కొడుకుల మనస్తత్వాలలో బేధం. రాక్షసునికి మాత్రం ఎప్పటిలానే దేవత కన్నీళ్ళు చూసి ఏడుపొచ్చింది.

రోజులు గడిచాయి. దేవపుత్రుడు తనపై తల్లితండ్రులు ప్రేమ కురిపిస్తున్నా విదుల్చుకుంటున్నాడు. అతడికి వారి ప్రేమ కంటకంగా తోచింది. ఇద్దరిదగ్గరా ఒక్క లాగనే దురుసుగా ప్రవర్తించేవాడు. తల్లి దేవతని, ఆమె తన దైవత్వాన్ని ఏమాత్రం కోల్పోలేదని అతనికి తెలుసు. అయినా ఆమెలో కొన్ని దుర్గుణాల్ని చూసి ఓర్వలేకపోయాడు. కొడుకు ప్రవర్తనకు వారెంతగానో నొచ్చుకున్నారు. అయినా ప్రేమ కురిపించటం ఆపలేదు.

ఓ రోజు దేవతకు జబ్బు చేసింది. రాక్షసునికి ఏడుపొచ్చింది. దేవకుమారునికి మరింత ఏడుపు వచ్చింది. దేవకుమారుడు తల్లి కాళ్ళపై పడి భోరున ఏడ్చాడు. రాక్షసుడు మాత్రం నిగ్రహించుకున్నాడు. తన భార్య మగవారంతగా ఏడవకూడదని చెప్పినట్టు అతనికి గుర్తుంది. రాక్షసపుత్రికి మాత్రం అది తమ కుటుంబం కాదేమోననిపించింది. ఆమె కంటికి తన భర్త పిల్లలు మాత్రమే తన కుటుంబంలా కనిపించింది. చిన్నప్పుడు దేవకుమారుడు తల్లితండ్రులతో దురుసుగా ప్రవర్తిస్తే తానెలా మందలించేదో, తల్లిదండ్రులపై తను ఎంత ప్రేమ ప్రకటించేదో అవన్నీ మరచిపోయింది. అయినా బాగుండదేమోనని కన్నీళ్ళు కార్చింది.

దేవతకు చివరిరోజులు సమీపించాయి. దేవపుత్రునికి విపరీతమైన దుఃఖం కలుగుతోంది. రాక్షసునికైతే పిచ్చిపట్టేట్లుంది. దేవతకొడుకుని పిలిచి అద్దం తెమ్మంది. ఆ అద్దంలో ఒకసారి ముఖాన్ని చూసుకుంది. కళావిహీనంగా ఉన్న ముఖంతో శవంలా కనబడుతోంది. నెమ్మదిగా నోరు తెరచిచూసుకుంది. నిజమే కొడుకు చెప్పినట్లు ఆమెకు దవడలపై దంతాలు చిన్న కోరల్లా రూపుదిద్దుకున్నాయి. ఒకప్పటి తన మనోహరమైన గంధర్వ రూపాన్ని గుర్తుకుతెచ్చుకుంది. ఎంతగానో కుమిలిపోయింది. అయినా భర్తపై కించిత్ కూడా ద్వేషం కలగలేదు.

కొడుకును అక్కున చేర్చుకొని అతని నుదుటిని ముద్దాడింది. కూతురి వైపు శెలవన్నట్టు చూసింది. భర్తను దగ్గరకు పిలిచి అతని పాదాలపై పడి ప్రాణం విడిచింది. రాక్షసునికి ఒక్కసారిగా తన కాలికింద భూమి కదిలినట్లనిపించింది. తూలిపోబోయి నిభాయించుకున్నాడు. అతనికి శ్వాస ఆడటం లేదనిపించింది. 'గాలి స్తంభించిందా?' అన్నట్లు వెర్రిచూపులు చూసాడు. దేవకుమారుడు తల్లి శవాన్ని చూసి చచ్చేంతగా ఏడ్చాడు. ఆ ఏడుపుకి అతని దవడలు నొప్పి కలిగి, చచ్చుబడినట్లనిపించింది. అయినా అతడు ఏడుపు ఆపలేదు.

రాక్షస పుత్రి పోయిన వాళ్ళ కోసం వేదన ఎందుకని ఓదార్చి ఎక్కువరోజులుంటే భర్త బెంగపెట్టుకుంటాడని చెప్పి వెళ్ళిపోయింది.

రాక్షసుడు ఆ రోజంతా విరక్తి కలిగిన వదనంతో ఆలోచించాడు. అతనికి లోకం, భవిష్యత్తూ, అన్నీ శూన్యంలా కనిపించాయి. దేవతలేని జీవితం వ్యర్థంలా కనపడింది. చచ్చిపోదామనుకున్నాడు. అంతలోనే కొడుకు గుర్తొచ్చాడు. పుత్రునిలో అతనికి భార్య కనపడింది. తను ఎందుకు జీవించాలో రాక్షసునికి అర్థం అయ్యింది.

అయితే దేవపుత్రుడు తల్లిలేని ఇల్లు స్మశానమన్నాడు. ఆ స్మశానంలో తాను ఉండలేనన్నాడు. తల్లే పోయినప్పుడు మిగిలిన వాళ్ళు తనకు అక్కరలేదన్నాడు. రాక్షసుడు కలత చెందాడు. కొడుకు దగ్గర ఏడ్చుకున్నాడు. గడ్డం పట్టుకొని బ్రతిమిలాడాడు. దేవపుత్రుడు శాంతించాడు. అయితే తండ్రి రాక్షసులతో కలవకూడదని షరతు విధించాడు. సరేనని ఒప్పుకున్నాడు రాక్షసుడు.

కొన్నాళ్ళు గడిచాయి. ఓ రోజు ఉదయం దేవపుత్రుడు బైటకు వెళ్ళి సాయంత్రానికి ఇల్లు చేరుకున్నాడు. ఇల్లంతా కోలాహలంగా ఉంది. 'ఏంటా' అనిచూస్తే ఇల్లంతా రాక్షసులతో సందడిగా ఉంది. రాక్షసులంతా తన తల్లి పటం ఉన్న గదిలో మాంసాలు

తింటున్నారు. తనకూ, తన తల్లికి నీచు వాసన కూడా పడదన్న విషయం దేవపుత్రునికి గుర్తుకు వచ్చింది. ఐనా తల్లి, తండ్రి కోసం, అక్కకోసం అప్పుడప్పుడూ నీసు వండటం గుర్తుకు వచ్చింది. పళ్ళు బిగబట్టాడు. కోపంగా తండ్రి వైపు చూసాడు. తండ్రి రాక్షసుల మధ్య ఆనందంగా ఉన్నాడు. రాక్షసులంతా తన తండ్రిని 'వాజమ్మ' అంటున్నారు. తన తండ్రి బుర్రాడిస్తున్నాడు. ఆతనిలో ఆవేశం కట్టలు తెంచుకుంది. రాక్షసులంతా వెళ్ళిపోయాక తను ఇంటిని విడిచిపోవటానికి నిశ్చయించుకున్నాడు. బయలుదేరిన కొడుకుని చూసి రాక్షసునికి భయం వేసింది. వెళ్ళవద్దని ఏడ్చాడు. దేవపుత్రుడు చలించలేదు. కాళ్ళుపట్టుకొని ప్రాధేయపడ్డాడు. దేవకుమారుడు శాంతించాడు. తండ్రికి చివరి అవకాశాన్ని ఇచ్చాడు. రాక్షసుడు ఊపిరి పీల్చుకున్నాడు.

మరి కొన్నాళ్ళు గడిచాయి.

రాక్షసులు తమ సోదరుణ్ణి తమ వైపు తిప్పుకోవటానికి ప్రయత్నించారు. అతన్ని నానా రకాలుగా మభ్యపెట్టారు. రాక్షసుడి మనస్సులాగినా కొడుకుకోసం ఆ కోరిక అణగదొక్కుకున్నాడు. 'వాజమ్మ'వన్నారు రాక్షసులు. అతడు బుర్రూపాడు.

కాలం గడిచే కొద్దీ రాక్షసుడు కొడుకు మాటలు పెడచెవిన పెట్టాడు.

ఓరోజు దేవపుత్రుడు ఇంటికి వచ్చేసరికి తండ్రి కనిపించలేదు. "వెర్రి తండ్రి ఏమైనాడా?" అని దేవపుత్రుడు ఎంతగానో కలవరపడ్డాడు. తనకు తెలిసిన ప్రదేశాలన్నింటా వెతికాడు. చివరకు తన తండ్రి రాక్షసనగరంలో తన వారి మధ్య కేరింతలు కొడుతూ కనపడ్డాడు. రాక్షసులు తన తండ్రిని 'వాజమ్మ' అంటున్నారు. తండ్రి బుర్రూపుతున్నాడు. తండ్రికి తన అవసరం లేదనిపించింది. వెంటనే వెనుదిరిగాడు దేవపుత్రుడు. రాక్షసుడది గమనించాడు. అతడిగుండె గుభేలు మంది. గభాల్న కొడుకు దగ్గరకు వచ్చి క్షమించమని ప్రాధేయపడ్డాడు. కొడుకు కాళ్ళపై పడి పసిపిల్లవానిలా ఏడ్చాడు. కొడుకు లేకపోతే చచ్చిపోతానన్నాడు. దేవపుత్రుడు చలించలేదు. తండ్రిని విడిచి వెళ్ళిపోయాడు.

రాక్షసునికి ఉన్న ఒక్క ఆశ అడుగంటినట్లనిపించింది. ఆఖరి దీపం కూడా ఆరిపోయినట్లనిపించింది. ఆకాశం నుండి దేవత తనను పిలుస్తున్నట్లనిపించింది. కొడుకు తనని విడిచి పోవటం మరోసారి గుర్తుకుతెచ్చుకున్నాడు. తను చూసిన కొడుకు చివరి రూపాన్ని ఒక్కసారి కనుల ముందుకు తెచ్చుకున్నాడు. మళ్ళీ అంతలోనే తన భార్య చితి గుర్తుకువచ్చింది. తను అప్పుడు ఎంతగా ఏడ్చాడో గుర్తుకు తెచ్చుకున్నాడు. తన ముద్దులకూతురి ప్రవర్తన, తన వారైన రాక్షసుల అభిమానం గుర్తుకు వచ్చింది. మరింత

ముందుకుపోయి, దేవతతో తనకు జరిగిన వివాహాన్ని, మొదటి సంతానాన్ని గుర్తుకుతెచ్చుకున్నాడు. వివాహం జరగుతున్నప్పుడు సిగ్గుపడుతున్న దేవత వదనం అతని కళ్ళముందు ప్రత్యక్షమయ్యింది. అంతలోనే చనిపోయేటప్పుడు ఆమె ముఖం ఎంత వికృతంగా తయారైందో జ్ఞప్తికి వచ్చింది. ఏడుపొచ్చింది. చచ్చిపోదామనుకున్నాడు.

రాక్షసులు అతణ్ణి చుట్టుముట్టారు. దేవతలతో పూర్తిగా తెగతెంపులయినందుకు ఆనందించమన్నారు. మౌనంగా తలాడించాడు. తినమంటూ మాంసం తెచ్చిఇచ్చారు. భార్యకోసం మానలేకపోయినా, కొడుకు కోసం అన్నాళ్ళ నుంచి తినటం మానేసిన మాంసాన్ని చూసి అతనికి నోరూరింది. ఆబగా తిన్నాడు.

'హాజమ్మ' వన్నారు రాక్షసులు.

బుర్రూపాడతడు.

రాక్షసుల మధ్యకు చేరి కేరింతలు కొట్టాడు. ఇప్పుడతనికి తన దేవత, పుత్రుడు గుర్తులేరు. వారిని పూర్తిగా మర్చిపోయాడు.

రాక్షసుల మధ్యన చేరి తిరిగి రాక్షసుడైపోయాడు.



# "చదూకుంటా. . .

"అమ్మా. . . మరీ. . . మరీ. . . నీకో మాటడిగే కోప్పడవు కదా. . .?"

"య్యేంట్రా అది?"

"అదీ. . . అదీ. . . పొద్దత్తమానం ఈ పనిసెయ్యటమేనేటి? నేనూ బడికెళ్ళి సదూకుంటానే"

"సీ. . . య్యేధవ! యెన్నిసార్లు చెప్పినా నీకు బుద్ధి రాదేమిట్రా! నువు సదూకుంటానికి పోతే బస్టాండు కెల్లి సేగోడీలెవడమ్ముతాడు?. మనకి డబ్బెట్టావచ్చుద్ది?"

పన్నెండేళ్ళ గోపీ మరి మాట్లాడకుండా తట్టపట్టుకొని బస్టాండు కెళ్ళాడు. ఆ రోజు ఆకాశం నిండా నల్లని మేఘాలు. వర్షం వచ్చేట్టుగా వుంది. తుఫానని రేడియోలో చెప్పారు కూడా.

పొద్దుపోయినంత వరకు గోపీ చేగోడీలు అమ్మాడు. అంతలోనే వర్షం తీవ్రమయ్యింది. ఇంటికి వెళ్ళలేక అక్కడే ఓ చప్పబండపై ముడుచుకొని పడుకున్నాడు.

"తను కూడా చదువుకుంటే ఎంతబాగుణ్ణు. తన వాళ్ళలో ఎంతమంది చదూకోలేదు? ఆ రాజుగాడు చదివింది పదోక్లాసే కదా! ఆ మాత్రం దానికి ఎంత టెక్కు. బోడి ఎటెండరు ఉద్యోగం వచ్చిందనే కదా! తనూ చదూకుంటే వాళ్ళకన్నా గొప్పవాడు కాలేడా ఏమిటీ?"

ఇలాంటి ఆలోచనలతో గోపీకి నెమ్మదిగా నిద్రపట్టింది. ఆ నిద్దట్లో వాడికొక కలవచ్చింది.

జోరుగా వర్షం పడుతుంది. ఆ వర్షంలో తడుసుకుంటూ ఓ బస్సు వచ్చి స్టాండులో ఆగింది. దానికచ్చం బడిపిల్లాడి యూనీఫారంలా చివరన కొంచెం నీలం రంగు మిగిలినదంతా తెలుపుతో నిక్కరు, చొక్కా తొడిగినట్లుంది. అది ఆగగానే పిల్లలంతా అందులో ఎక్కారు. వారి చేతుల్లో పలకాబలపం ఉన్నాయి. కొందరి దగ్గర పుస్తకాలున్నాయి. గోపీ బస్సు చేరుకునేసరికి కొంచెం ఆలస్యం అయ్యింది. అప్పటికి బాగాతడిసాడు. భయంభయంగా బస్సుకేసి చూసాడు. పిల్లలందరూ ఎవరి సీట్లలో వారు కూర్చున్నారు. అందరూ శ్రద్ధగా ముందుకు చూస్తున్నారు. డ్రైవరు బస్సు అద్దాలపై నల్లగా ఏదో రాసి తిరిగి స్టీరింగు ముందు కూర్చుంటున్నాడు. గేటు దగ్గర కండక్టరు యమభటుడిలా ఉన్నాడు.

గోపీ బితుకుబితుకుమంటు బస్సుదగ్గరకు వెళ్ళాడు. కండక్టరు గోపీకేసి కోపంగా చూసి "ఏంరా! ఇంత ఆలిస్సెం ఏంది?" అని అడిగాడు.

"మరేమో జొరమొచ్చిందండి! అందుకే వచ్చేటప్పటికి ఈ వేళయ్యింది."

"ప్రతి దానికీ ఇదోసాకు. ఫో. ఫో."

'హమ్మయ్య' అనుకుంటూ బస్సెక్కి తన సీట్లో కూర్చున్నాడు.డ్రైవరు బొగ్గుముక్కతో అద్దాలపై నల్లగా రాసి కూర్చుంటున్నాడు.

"హోమ్‌వర్క్. . . హోమ్‌వర్క్. . ." అంటూ కండక్టరు అందరి పిల్లల దగ్గరకు వచ్చి ఏదో చూస్తున్నాడు గోపీకి భయం వేసింది. అతని వంతు వచ్చింది.

"ఏదిరా హోమ్‌వర్కు చూపియ్యి"

"మరేమో జొరం కదండి. చెయ్యలేదండి" వణుకుతూ చెప్పాడు గోపీ.

" నీ యవ్వ ప్రతిదానికి జొరమనటం నేర్చుకున్నావ్ రా? ఈ సారి ఊరుకోను. చెయ్యిపట్టు" గద్దించాడు.

గోపీ వణుకుతున్న చెయ్యిచాచాడు. కర్రతో ఒక దెబ్బ గట్టిగా పడింది. 'అమ్మా' అంటూ గోపీ కాలు నిమురుకున్నాడు. మళ్ళీ అక్కడే ఆ చేతిపైనే మరో దెబ్బపడింది. గోపి బాధగా పాదం నిమురుకొని కళ్ళు తెరచి చూసాడు.

ఎదురుగా బస్టాండు పాకివాడు కర్కశంగా కర్రతో కొట్టి "వానపోయింది. ఇంటికి ఫో! మళ్ళీ కనిపిస్తే మక్కెలిరగదంతా" అంటూ పోయాడు.

బస్టాండు ఏమి వాడి అబ్బ సొమ్ము కాదు. అయినా అప్పుడప్పుడూ వాడి చేతిలో దెబ్బలు తినటం గోపీకి అలవాటుయిపోయింది.

గోపీ జరిగిన కలంతా ఓసారి గుర్తుకు తెచ్చుకున్నాడు "అబ్బ! తను చదూకుంటే ఎంత బాగుణ్ణు? దెబ్బలు తిన్నా చదువొచ్చుద్ది"

అంతలోనే ఏదో గుర్తొచ్చిన వాళ్ళా ఒళ్ళు తడుముకున్నాడు. నిజమే తనకి నిజంగానే జొరం వచ్చింది. ఇప్పుడింటికెలా పోవటం? అని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఇంతలో ఒక నల్ల చీర కట్టుకొని ఏ ఆభరణాలూ కనీసం బొట్టు, గాజులూ కూడా లేని ఓ స్త్రీ వచ్చింది. ఆమె చాలా వికృతంగా ఉంది. ముఖాన చర్మం వేళాడుతూ ఉంది.

కానీ మనిషిని చూస్తే మంచిదానిలా ఉంది. ముఖంలో ఏదో తేజస్సు కనపడుతోంది. యాభై ఏళ్ళ దానిలా ఉంది.

ఆమె నెమ్మదిగా గోపీ దగ్గరకు వచ్చికూర్చుంది.

"ఏమిరా! చూసావుట్రా! అందుకే అమ్మ చెప్పినట్లు బుద్ధిగా చేగోడీలు అమ్ము. చదువుకుంటానంటే నీ కల్లో కండెట్టరు చేతిలో తిన్నట్లే దెబ్బలు తినాల్సొస్తది" అందామె.

"నువ్వూరుకో తల్లీ! జొరం రాబట్టి తిన్నా కానీ, లేకపోతే ఎంచక్కా హోం వర్కు చేసి మా బాగా చదువుకునే వాణ్ణి కాదా ఏటి?"

ఆమెకు ఏం చెప్పాలో తెలియలేదు. మారు మాట్లాడక అక్కడనించి లేచి వెళ్ళిపోబోయింది.

గోపీ ఏదో గుర్తొచ్చిన వాడల్లే లేచి అనుమానంగా

"ఇంతకీ ఎవరు తల్లి నువ్వు?" అనడిగాడు.

వెళ్ళిపోతున్నదల్లా నెమ్మదిగా వెనక్కితిరిగి ఒక్క క్షణం ఆమె గోపి వంక తేరిపారా ప్రేమగా చూసి

"జ్వరాన్ని" అంది.

గోపీ ఒళ్ళు తడుముకున్నాడు. ఒళ్ళు మామూలుగా ఎప్పటిలానే ఆరోగ్యంగా ఉంది.



# అడవిన పూసిన పూవు

అడవిలో మొదటి గులాబీ పూసింది. ఆకాశాన్నంటే చెట్లమధ్య అందంగా పూసింది. అయితే గులాబీ అందుకు ఆనందంగా లేదు. తన అందమంతా అడవిన గాచిన వెన్నెల్లా అయిపోయిందని దిగాలుగా కూర్చుంది. మిగిలిన చెట్లన్నీ తన అందాన్ని చూసి అసూయపడాలనుకునేది గులాబీ. కానీ అసూయపడటానికైనా తనను గమనించేవారేరీ? ఆకాశాన్నంటే చెట్లకు కళ్ళుకూడా నెత్తిన ఉంటాయి. క్రిందకు బుర్రొంచి చూసేదే తక్కువ.

"హు! పల్లెటూరి (పల్లెటడవి) చెట్లు. అందాన్ని గురించి వీటికేం తెలుసు.

తన అందాన్ని కళ్ళప్పగించి చూసేవాళ్ళు కనపడితే ఎంత బాగుంటుంది. ఈ ముసలి చెట్లమధ్య కాక నాగరిక ప్రపంచంలో తనకు చోటు దొరికితే?"

గులాబీ ఆ ఆలోచనలతోనే ఒక వసంతం గడిపింది.

ఆ రోజు గులాబీ చాలా చూసింది. ఎవరో కొంత మంది వచ్చి చెట్లు నరుక్కుపోవటం, దారిచేసుకుంటూ అడ్డంగా ఉన్న చిన్న మొక్కల్ని తొక్కేయటం, పీకివేయటం అన్నీ చూసింది.

గులాబీకి భయం వేసింది 'తననుకూడా తొక్కేస్తారేమో' ఏంచెయ్యాలో తోచలేదు. ముల్లు నిక్కబొడిచి, ఊపిరి బిగబెట్టుకొని చూసింది. తన ముళ్ళు వారినేం చేయగలవు? అయితే వాళ్ళు ఇటుప్రక్కకు రాకుండానే వెళ్ళిపోయారు.

ఆ రోజంతా గులాబీ దీర్ఘంగా ఆలోచించింది. "ఎలాగైనా ఈ అడవి నుండి బయటపడాలి. తన అందాన్ని గుర్తించే నాగరిక ప్రపంచంలో అడుగుపెట్టాలి. అక్కడ తన అడుగులకు మడుగులొత్తే వాళ్ళని సంపాదించుకోవాలి.

గులాబీ ఓ నిశ్చయానికి వచ్చింది. అనుకున్నదే తడవుగా గాలిని పిలిచింది.

"నాకు పట్నం పోవాలని ఉంది. ఇల్లు చూసి పెట్టవూ?" ప్రాధేయపడింది.

సరేనంటూ గాలి బయలు దేరింది.

తియ్యటి కలలతో మరుసటి రోజు గాలి రాకకై ఎదురుచూస్తూ, ఆ రాత్రి గులాబీ నిద్రపోయింది.

తెల్లవారింది. ఉసూరు మంటూ గాలి విసుగ్గా వచ్చి గులాబీ ముందు వాలింది. గాలి కొంచెం నల్లబడింది.

అది గమనించే స్థితిలో గులాబీ లేదు.

"ఇల్లు దొరికిందా?" ఆత్రంగా అడిగింది గాలిని.

"ఓ"

"ఎలా ఉంది?"

"ఇంటికేం బ్రహ్మాండమైన భవంతి. కానీ. . ." నసిగింది గాలి.

"ఇంకేం? బయలుదేరుతా!" గులాబీ తొందరపడింది.

"ఆగాగు అద్దెక్రింద నెలకు పదిపువ్వులైనా ఇవ్వాలని నేల చెప్పింది." అసలు విషయం చెప్పింది గాలి.

అంతవరకు సంభాషణ వింటున్న నేల ఉలిక్కిపడింది. "ఏంటీ! అద్దె చెల్లించాలా? ఇదెక్కడి చోద్యం ఈ విడ్డూరాలు మేమెరగము బాబూ! పట్నంలో నేలకు ఇంత విలువా? ఇక్కడ చూడు ఈ చెట్లు, మొక్కలు ఏ అద్దె చెల్లించకుండా మా మీద పడి ఎలా పెరుగుతున్నాయో?" ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"అద్దె లేదంటావేమిటి? నేనెందుకు కురుస్తున్నాను? నీటి తరపున అద్దెగా వానను చెల్లిస్తున్నాను కదా!" మేఘం నేలను గద్దించింది.

పెద్ద చెట్లు, గడ్డిపరకలు "అహ్హాహ్హా" అంటూ పకపకలాడాయి.

"మీరంతా ఊరుకోండి. ఈ సమస్య నాది. అద్దే కదా! పట్నంపోవాలే కానీ నెలకు పదేంటి, పన్నెండు పువ్వులైనా ఇస్తాను." గులాబీ బయలుదేరటానికి సిద్ధమైంది.

"నువ్వొకసారి ఆలోచించు. అక్కడ నువ్వనుకున్నంత బాగా ఉండదు. ఇక్కడి స్వచ్ఛత, స్వేచ్ఛ అక్కడ ఉండవు" గాలి నచ్చచెప్పటానికి ప్రయత్నించింది.

ఆ మాటలు వినిపించుకొనే స్థితిలో గులాబీ లేదు. గులాబీ పట్నం పోవటానికి ఏర్పాట్లు చకచకా పూర్తయ్యాయి.

నేల బాధపడింది. తోటి గడ్డిపరకలు ఏడిచాయి. పెద్ద చెట్లు తల క్రిందకు వంచి

(దించి) గులాబీ వైపు మౌనంగా చూస్తున్నాయి.

గులాబీ బయలుదేరింది. మార్గమధ్యంలో తుమ్మెద అడిగింది.

"ఎక్కడికి?"

"పట్నం పోతున్నా! మరి ఇక్కడకు రాను" సంబరంగా చెప్పింది గులాబీ.

గాలి పొలిమేర వరకు సాగనంపి ఇల్లు చూపించే పని మరో గాలికి అప్పగించింది.

"అదేంటీ? నువ్వురావా?" ప్రశ్నించింది గులాబీ.

"ఉహూ! ఆ పట్నం వాతావరణం నా ఒంటికి సరిపడదు"

"అప్పుడప్పుడూ వస్తూపోతుండేం" ఆర్ద్రంగా అంది గులాబీ.

" అమ్మో చచ్చినా రాను. అక్కడకు వస్తే ఇంకా నల్లబడిపోతాను. అనుభవపూర్వకంగా నిన్ననే తెలిసింది"

గులాబీ చిన్న బుచ్చుకుంది. తన నివాసం గురించి గాలి అలా మాట్లాడటం నచ్చలేదు. తాను అంత ప్రేమగా పిలిచినందుకైనా సరే అని ఉండాల్సింది.

"నువ్వు నూతిలో కప్పవి. అందుకే ఈ అడవంటే నీకంత ఇష్టం". శెలవు తీసుకుంటూ అంది.

"కాదు గాలిని. ఎక్కడికైనా వెళ్ళగలను. ఇందుగలనందు లేనను సందేహం . . . ." నిరూపించటానికా అన్నట్టు మాట పూర్తి చేయకుండానే రివ్వున అంతెత్తున ఎగిరి వెనక్కివెళ్ళిపోయింది గాలి.

దూరం నుంచి గులాబీని చివరిసారి చూసి రెండేసి ఆకులని చెమర్చాయి పెద్ద చెట్లు.

పట్నం వచ్చిపడింది గులాబీ. ముందుగా అనుకున్నట్లే ఇక్కడ తన అందానికి చాలా విలువ ఉంది. ఎవరు అటువైపు వెళ్ళినా ఓ క్షణం పాటు తనవైపు కళ్ళార్పకుండా చూస్తారు. తోటి పువ్వులు కూడా అసూయ చెందుతున్నాయి. గర్వంగా నవ్వుకుంది గులాబీ.

ఎటొచ్చీ అద్దె చెల్లించేటప్పుడే బాధగా ఉంది. తన పువ్వుల కాలం తీరకముందే యజమాని కత్తెర తెచ్చికోస్తుంటే, గుండెల్లో గునపం గుచ్చినట్లుంది.

మునుపైతే అడవిలో వాడిపోయి రాలిపోయేవరకు ప్రాణానికి ఏ కష్టం తెలియకుండా

హాయిగా రాలిపోయేది. ఇప్పుడైతే తన ముల్లు తనకే గుచ్చుకున్నంత బాధకలుగుతోంది. అయినా ముందు కుదుర్చుకున్న ఒప్పందమే కనుక సరిపెట్టుకుంది.

ఐతే రోజులు గులాబీ అనుకున్నట్టు సాగలేదు. ఓ రోజా గులాబీ పూవులను పూయించలేకపోయింది. యజమాని కత్తెరపట్టుకొని తనవైపే రావటం చూసింది. గులాబీకి భయం వేసింది. ఒకవేళ యజమాని తననే కత్తిరిస్తుందేమో? ఆమెకేం తెలుసు? తనమొక్క శరీరం యొక్క ప్రాణం, మనసు, గుండె, మెదడూ అన్నీ తనలోనే ఉన్నాయని. అవి తనలో ఉండబట్టేకదా, ఇన్నాళ్ళైనా వాడకుండా, రాలకుండా తానొక్కటే నిలిచింది. ఆ పాటి ఇంగితజ్ఞానం యాజమానికి ఉంటే ఫరవాలేదు.

ఉహు! గులాబీ అనుకున్నట్టే అయ్యింది.

యజమాని తనని కత్తిరించింది. విలవిల్లాడింది గులాబీ. కోపంగా ముల్లుతో పొడిచింది. యజమానికీ ఒళ్ళుమండింది. ముల్లు విరిచేసింది. రెక్కలు తెగిన పక్షిలా ఎఱ్ఱగా రక్తసిక్తం అయినట్టుగా కనపడుతుంది గులాబీ.

"ఇప్పుడు అందంగా ఉంది". యజమాని అనుకుంది.

జీవచ్ఛవంలా ఓ రోజంతా యజమాని కొప్పులో స్పృహ తప్పి పడుకుంది గులాబీ.

కళ్ళు తెరిచేసరికి ఒక గాజు గ్లాసులో ఉంది. నీళ్ళు కూడా పోసేరు. గొంతు తడుపుకుంది గులాబీ.

'తన శరీరం ఏమయ్యిందో? ఈ పాటికి చచ్చిపోయి ఉంటుంది.' గులాబీ కన్నీరు కార్చింది గాబోలు గ్లాసులో నీటిమట్టం కొంచెం పెరిగింది.

"ఇక తను బంధింపబడింది. మామూలుగా కాదు. అన్ని అవయవాలనీ నరికివేసి, ప్రాణాన్ని వేరుగా బంధించేసారు. " ఇప్పుడు తాను రెక్కలు తెగిన పక్షిని" ఆలోచిస్తూ దిక్కులు చూసింది.

పంజరంలో చిలుక కూడా తనలాగనే ఏడుస్తుంది. "అడవిలో హాయిగా ఎగిరేదాన్ని, నన్ను పట్టుకొని బంధించేసారు నాయనో" ఘొల్లుమంది చిలుక.

"ఊరుకో నేనుమాత్రం, భూమిలో చక్కగా నాకు నచ్చిన రూపులో ఉండేవాడ్ని నన్నిలా బయటకు లాగి వారికి నచ్చిన రూపంలో సాగగొట్టి బంధించలేదూ?" ఓదార్చింది లోహ పంజరం.

" అసలు భూమిలో ఉండటమే నీకు బందీ కానా. బయటే నీకు స్వేచ్ఛ. ఇక రూపమంటావా? నీకేం? చక్కగా తయారు చేసి నగిషీలు చెక్కి అలంకరించారు". ఏడుపాపి పంజరం మీద చివ్వున లేచింది చిలుక.

"ఏది ఏమైనా బాధపడి ప్రయోజం లేదు. నన్ను చూడండి, గానుగెద్దు జీవితమైనా ఎలా పరిస్థితులకనుకూలంగా నడుచుకుంటున్నానో?" ఫేనుకు బంధించి ఉన్న పట్నం గాలి చక్కర్లు కొడుతూ అంది.

"నీకేం ఎన్ని కబుర్లైనా చెప్తావు. మా బాధ మాది. మునుపైతే నేను ఎంత పచ్చగా బ్రతికే దాన్నో. నన్ను చంపి ఇలా చేసారు. తలచుకుంటేనే ఏడుపొస్తోంది." కఱ్ఱ కిటికీ కిఱ్ఱూమంటూ ఏడ్చింది.

"నిజమే మేమూ చెఱువుల్లో, సరస్సుల్లో ఆనందంగా, స్వేచ్ఛగా ఈదేవాళ్ళం. ఇక్కడ ఆ స్వేచ్ఛ ఏదీ? వేళకు తిండి పడేస్తే చాలా? ఆ స్వేచ్ఛలేని బ్రతుకు ఎందుకు?' ' గాజు జాడీలోని చేప పిల్లలు కిటికీకి వత్తాసు పలికాయి.

"నేను మాత్రం ? గలగలా పారుతూ, అంత ఎత్తు సెలయేరు నుండి ఆనందంగా ప్రవహిస్తూ చలాకీగా దూకేదాన్ని. ఇక్కడ కనీసం చలించలేకపోతున్నా" గాజు జాడీలోని నీరు కూడా కష్టాన్ని చెప్పుకుంది.

గులాబీ అంతా గమినించింది.

"తన లాగే స్వేచ్ఛని, అందమైన జీవితాన్ని ఇన్ని కోల్పోయినాయా? మరి తానెందుకు కష్టమేదో తనకొక్కదానికే వచ్చినట్టు బాధపడటం. ఈ లోకంలో అన్నీ కష్టాలను అనుభవిస్తాయి. ఆ కష్టాలను గురించి ఆలోచించి బాధపడటం మూర్ఖత్వం. ఇలా గాలిలా యాంత్రికంగా జీవించటమే ఉత్తమం." నిశ్చయించుకొంది గులాబీ.

ఓ నాలుగు రోజులు గడిచాయి. గులాబీ చచ్చిపోయే క్షణాలు దగ్గరకొచ్చాయి. అప్పటికే చాలా రేకులు రాలిపోయాయి. సత్తువ ఉడిగిపోయిన గులాబీ చివరి కోరిక కోరుకుంది "దేవుడా! నా శరీరాన్ని ఒక్కసారి చూపించు."

దేవుడు గులాబీ మొర ఆలకించినట్లుగా యజమాని వచ్చి వాడిపోయిన గులాబీని కిటికీలో నుంచి బయటకు విసిరేసింది. గులాబీ వచ్చి తన శరీరానికి సమీపంలో పడింది. అప్పటికే తన శరీరం చచ్చిపోయింది. అయితే ఎందుకనో యజమాని ఇంకా పెరికివేయలేదు. గులాబీకి తన శరీరాన్ని తాకాలనిపించింది. కానీ అందలేదు. చేరుకునే శక్తికానీ, కనీసం

గాలిని సహాయం అర్థించేందుకు పలికే శక్తిగానీ లేదు.

ఇంతలో యజమాని వచ్చింది.

' ఈ చచ్చిన మొక్క ఇక్కడెందుకు?' అనుకుంటూ పెకిలించి విసిరివేసింది. ఆ శరీరం వచ్చి గులాబీ మీద పడింది. గులాబీ తన శరీరాన్ని ముద్దాడింది.

'ఒకప్పుడు పచ్చగా పొగరెక్కిన ముళ్ళతో ఉండే తన శరీరమేనా ఇది? చచ్చి నల్లగా మారిన ఈ నిర్జీవ శరీరానికి, ఆ శరీరానికి ఎంత తేడా? అడవిలోనైతే తాను చచ్చేదా? అక్కడ తనను ఎవ్వరూ చావనివ్వరు. గాలైనా, నేలైనా, మేఘమైనా గడ్డిపరకలైనా, పెద్ద చెట్లైనా, వానైనా, ఏవైనా ఏదో ఒకటి చేసి బ్రతికించేవి. ఒక వేళ చనిపోయినా సరే పెకిలించక అక్కడే నేలలో సమాధి అయినవరకు తనను అంటిపెట్టుకొని శ్రద్ధాంజలి ఘటించేవి'

గులాబీకి అడవి గుర్తొచ్చింది. ఏడుపొచ్చినా ఏడవలేకపోయింది. దేవుడికి రెండో కోరిక కోరాలని ఉంది. " చనిపోయేముందు ఒక్కసారి తన అడవిని చూపించమని." కానీ ఆ కోరిక తీరదని తనకీ తెలుసు.

ఇంతలో యజమాని ఎందుకో మళ్ళీ వచ్చి గులాబీని, గులాబీ శరీరాన్ని చేతిలోనికి తీసుకుంది.

"ఒక వేళ ఇన్నాళ్ళూ అందాన్ని పంచి ఇచ్చినందుకు కృతజ్ఞతాపూర్వకంగా ముద్దాడుతుందేమో'' అనుకుంది గులాబీ.

"పోనీ అదో తృప్తి. పోయేటప్పుడు పడ్డ కష్టమంతా మరిచిపోవచ్చు''

"ఇక్కడుంటే ఎవరికాలికైనా గుచ్చుకోవూ?" యజమాని స్వగతం అనుకుంటూ గోడవతల చెత్త కుండీలో గులాబీని, గులాబీ శరీరాన్ని విసిరేసింది.

చెత్తకుండీలో చనిపోతూ గులాబీ బయటకు వెళ్ళగక్కలేకపోయిన మాటను మనసులో అనుకుంది.

"అడవి తల్లీ నన్ను క్షమించవూ?"



# చంటి మావయ్య

అది ఓ ఉమ్మడి కుటుంబం. ఉమ్మడి కుటుంబం అంటే అన్నదమ్ములు కలసి ఉండటం కాక అక్కడ అక్క చెల్లెళ్ళు కలసిఉన్నారు. ఇద్దరు అక్కా చెల్లెళ్ళు ఎవరి కాపురాలు వాళ్ళు గుట్టుగా చేసుకుంటూ కలసిమెలసి ఉన్నారు. పెద్దామె భర్త హైస్కూలు టీచరు. చిన్నామె భర్త బ్యాంకులో క్లర్కు. పెద్దామె భర్త ఉన్నదాంతో సంతృప్తి పడిపోయేవాడు. చిన్నామె భర్తకు మాత్రం గొప్పవాణ్ణి కావాలనే కోరిక ఉండేది.

పెద్దామెకు ఇద్దరు పిల్లలు. కూతురూ కొడుకున్నూ. రాణి, చంటి వాళ్ళ పేర్లు. రాణి చంటికన్నా నాలుగేళ్ళు పెద్దది. చిన్నామెకు ఇద్దరూ కూతుళ్ళే. వాళ్ల పేర్లు చిట్టి, చిన్ని. వాళ్ళ మధ్య బేధం కూడా నాలుగేళ్ళే. ఆ పేర్లు వాళ్ళ ముద్దుపేర్లు. వాళ్ళ అసలు పేర్లు ఇప్పుడు అప్రస్తుతం.

పిల్లలు నలుగురూ చిన్నప్పటినుంచీ కలిసి ఆడుకునేవారు. అప్పుడప్పుడు తగువులాడుకున్నా, వెంటనే కలసి పోతుండేవారు. రోజూ చెఱువుగట్టుపైనా, డాబాపైనా, కొబ్బరితోటలో ఎంతో ఆనందంగా ఆడుకునేవారు.

చిట్టి రాణి కన్నా ఏడాది చిన్నది. చిన్ని కూడా చంటికంటే ఏడాది చిన్నది. వాళ్ళు ఒకరిని విడిచి ఒకరుంటామన్న ఊహ కూడా రానిచ్చేవారు కాదు.

పిల్లలు కొంత పెద్ద వాళ్లయ్యారు. రాణి పధ్నాలుగేళ్ళదయ్యింది. మిగిలిన వారెంత వయసు కలిగిఉన్నారో లెక్కకట్టేయవచ్చు. అంటే చంటి పదేళ్ళ వాడన్నమాట. చిట్టి, చిన్ని వాళ్ల నాన్నకు బొంబాయిలో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం వచ్చింది. అతడు పరమానంద భరితుడయ్యాడు. సంతోషంగా పండుగ చేసుకున్నాయి ఆ రెండు కుటుంబాలు. చివరకు వాళ్ళు వెళ్ళవలసిన రోజు రానే వచ్చింది. అక్కా చెల్లెళ్ళిద్దరూ భోరున విలపించారు. వారి భర్తలిరువురూ ముభావంగా నించున్నారు. చిట్టి, రాణి కళ్ళతోనే దీనంగా మాట్లాడుకున్నారు. చంటి మాత్రం చిన్ని దగ్గరకు వచ్చి భుజంపై చెయ్యివేసి "మర్చిపోకేం. పండక్కి రా! చెఱువు గట్టుపై ఆడుకుందాం" అన్నాడు.

'ఓ' అంది చిన్ని.

వాళ్ళు వెళ్ళిపోయారు. ఓ రెండ్రోజుల వరకు చంటి ఎవ్వరితోనూ మాట్లాడలేదు. నిద్రపోయేవాడుకాదు. సరిగ్గా అన్నంకూడా తినేవాడు కాదు. అమ్మ దగ్గరకు వెళ్ళి చిన్నిని

చూపించమని ఏడ్చేవాడు. తల్లి ఓదార్చేది.

ఓ రోజు చంటి తన తల్లి, పిన్నికి ఉత్తరం రాయటం గమనించాడు. అతడికి కూడా చిన్నికి రాయాలనిపించింది. తల్లి రాయగా మిగిలిన చిన్న ప్రదేశంలో ఇలా రాసాడు ఓ మూలన.

"చిన్ని బాగున్నవా? చెరవు గటు కెలితె నువ్వె గురుతొత్తునవు. చిట్టికి అడిగనని చెపు. నకు ఉతరం రయి"

దానికి చిన్ని దగ్గరనుండి వెంటనే జవాబు రాలేదు. రెండోసారి పిన్నిరాస్తే అందులో జవాబు వచ్చింది. చిన్ని ఎంతో ఆనందపడుతూ రాసింది. ఆలస్యంగా రాసినందుకు సారీ చెప్పింది. కానీ అది చంటికి చాలావరకు అర్థం కాలేదు. చెల్లికి తెలుగు సరిగ్గా రాయటం చేతకాదని నవ్వుకున్నాడు.

కొన్నేళ్లు గడిచాయి. పిల్లలు నలుగురూ పెద్దవాళ్ళయ్యారు. రాణికి పెళ్ళైపోయింది. చిట్టికి కూడా అయిపోయిందంట. ఏదో ఫారిన్ సంబంధం చేసారు. చంటివాళ్ళు బొంబాయి వెళ్ళటం కుదరలేదు. నిజానికి వాళ్ళ మధ్య ఇప్పుడంతగా రాకపోకలు లేవు. ఉత్తరప్రత్యుత్తరాలు కూడా ఏదో శుభకార్యానికి తప్ప రాసుకోవటం లేదు. ఒకళ్ళని ఒకళ్ళు చూసి ఐదేళ్ళయ్యింది. చంటికి కూడా వాళ్ళంతగా గుర్తులేరు. అతడు గొప్ప రచయిత అయ్యాడు. పేరు ప్రఖ్యాతులు, డబ్బు బాగా సంపాదించాడు. తండ్రిమాత్రం ఇంకా ఆ పల్లెటూరి హైస్కూల్లో టీచరుగానే ఉన్నాడు. చంటి ఒక్కడూ పట్నంలో పెద్దబంగాళాలో ఉంటున్నాడు. ఎప్పుడో ఏడాదికోసారి తల్లిని చూడటానికి వెళ్తుండేవాడు. పిన్నివాళ్ళు ఇప్పుడు గొప్ప హోదాలో ఉన్నారని అతను విన్నాడు. చిన్ని పెళ్ళని తెలిసినా వెళ్ళలేకపోయాడు.

టెలిగ్రాములో "విష్ యు ఎ హ్యాపీ మ్యారీడ్ లైఫ్" అని పంపించాడు. దానికి జవాబుగా ముక్తసరిగా "థ్యాంక్యూ" అని వచ్చింది చిన్ని దగ్గరనుండి.

ఇంక చంటి ఒక్కడే పెళ్ళికి మిగిలాడు. తల్లి వచ్చి ఎంతగానో నచ్చచెప్పి చూసింది. అయినా చంటి పెళ్ళి చేసుకోనని భీష్మించుకున్నాడు. చంటి ఓ ప్రేమ వైఫల్యం కారణంగా వివాహానికి విముఖత చూపాడు. అప్పట్లో తను ప్రేమించిన అమ్మాయితో కనుక పెళ్ళైతే చిట్టిని, చిన్నిని నెలరోజుల ముందునుంచే పిలిపించాలనుకున్నాడు. కానీ ఇప్పుడు పెళ్ళి తలంపే లేదు.

తల్లికి విసుగెత్తి వెళ్ళిపోయింది.

పట్నంలో చంటి స్నేహితుని ఇంటి దగ్గర శంకరం గారని ఒక హైస్కూలు మాష్టారు ఉండేవారు. అతనికి ఇద్దరు కూతుళ్ళు. పెద్దామె జ్యోతి పదేళ్ళది. చిన్నది లక్ష్మి ఆరేళ్ళది. చంటి ఆ పిల్లలిద్దరి మీదా ఆప్యాయత పెంచుకున్నాడు.

రోజూ వాళ్ళకి చాక్లెట్లు, బిస్కెట్లు తెచ్చి ఇచ్చేవాడు. కథలు చెప్పి ఆడించేవాడు. కొన్నాళ్ళకి తన ఇంట్లో కొంత భాగాన్ని వాళ్లకే చవకగా అద్దెకు ఇచ్చి తన దగ్గరకు రప్పించుకున్నాడు. శంకరం దంపతులది మధ్య తరగతి కుటుంబం. చంటి లాంటి సంపన్నుడి అండ వారికెంతో ఆనందం కలిగించింది. ఆ కృతజ్ఞత వారెప్పుడూ కోల్పోలేదు.

చంటి ప్రవర్తన అతని బంధువులకు, తల్లితండ్రులకు, అక్కయ్యకు వింతగా తోచేది. పరాయి వాళ్ళకింద అంత ఖర్చు పెట్టడం ఎందుకో వాళ్ళకు అర్థం కాలేదు.

చంటి రోజూ పిల్లలిద్దర్ని ఆడించేవాడు. వాళ్ళిద్దరూ అతడ్ని 'మావయ్యా' అని ఆప్యాయంగా పిలిచేవారు. చంటి మాత్రం వాళ్ళని పిలవటానికి తడబడేవాడు ఏదో పిలవబోయిన వాడల్లే, పేరు మరచిపోయినట్లుయి, ఓ క్షణానికి తమాయించుకొని 'జ్యోతీ' అని పిలిచేవాడు 'నేను లక్ష్మిని' అనేది లక్ష్మి. అతడు నవ్వుతూ ముద్దాడేవాడు. లక్ష్మిచేత జ్యోతి చేత రెండు బుగ్గలపై ఒకేసారి ముద్దు పెట్టించుకునేవాడు.

కొన్నేళ్ళు గడిచాయి. చంటికి ముప్పై ఐదేళ్ళు వచ్చాయి. జ్యోతి ఇరవై ఏళ్ళది. ఆమెకు సంబంధాలు వెదుకుతున్నారు శంకరం దంపతులు. చంటి కట్నం గురించి వెనుకాడవద్దని భరోసా ఇచ్చాడు. కానీ జ్యోతి పెళ్ళి చేస్కోనని పట్టుబడింది. శంకరం దంపతులు చంటిని నచ్చచెప్పమన్నారు. చంటి జ్యోతిని పిలిపించాడు. జ్యోతి వచ్చింది. ఓ క్షణం తడబడి 'జ్యోతీ' అని పిలిచాడు చంటి. ఆమె ముభావంగా దగ్గరకొచ్చి కూర్చున్నది. పెళ్ళెందుకు చేసుకోనందో కారణం అడిగాడు. ఆమె ఓ క్షణం బుర్రదించుకొని 'నువ్వు కూడా అదే ముహుర్తాన పెళ్ళిచేసుకుంటే చేసుకుంటా' నన్నది. చంటి ఆ రాత్రంతా ఆలోచించాడు. మరుసటి రోజు సరే నన్నాడు.

ఒకే పందిట్లో జ్యోతికి ఓ గొప్పింటి సంబంధాన్ని, తాను ఓ పిల్ల ఉన్న వితంతువును చేసుకున్నాడు. ఆ పిల్లను ఒకసారి 'జ్యోతి' అని, ఒకసారి 'లక్ష్మీ' అని పిలిచేవాడు పెళ్ళి ఎంతో ఘనంగా, చాలా డబ్బు ఖర్చుపెట్టి చేసాడు. చంటి బంధువుల కళ్ళు కుట్టాయి.

ఓ ఏడాది గడిచింది. చంటి తండ్రి కాబోతున్నాడు. ఆ రోజు రానే వచ్చింది. ఆమె ఒక మృత శిశువును కని, తనూ ప్రాణం విడిచింది. చంటి కుమిలిపోయాడు.

జ్యోతి, లక్ష్మి అతడ్ని ఓదార్చారు.

మరో ఏడాది గడిచింది. లక్ష్మికి కూడా సంబంధాలు చూస్తున్నారు. శంకరం దంపతులు. అయితే లక్ష్మి కూడా చేసుకోనన్నది. ఆమె మావయ్యకు వండిపెడుతూ పెళ్ళి చేసుకోకుండానే ఉండిపోతానన్నది.'శంకరం దంపతులు చంటి చేత చెప్పించి చూసారు. ఆమె 'ససేమిరా' అన్నది. లక్ష్మి మొండిది. 'కొన్నాళ్ళుపోతే ఆమే మారుతుందిలే' అని సర్ది చెప్పాడు చంటి. అతడన్నట్లుగానే ఓ ఏడాది గడిచాక లక్ష్మి పెళ్ళి చేసుకొంది. కొన్నాళ్ళకు జ్యోతికి, లక్ష్మికి కూడా పిల్లలు పుట్టారు. చంటి తాను ఆ కుటుంబసభ్యుడిని కానని ఏనాడూ అనుకోలేదు. అలా అని తన తల్లితండ్రులను విస్మరించలేదతను. అప్పట్లో నెలకు రెండువేలు ఇంటికి పంపించేవాడు. ఏడాది క్రిందటే అతని తల్లి, తండ్రి పోయారు. చేయవలసిన కార్యం చేసి వచ్చి బాధపడ్డాడు. అక్కడే తన అక్క రాణిని చూసాడు. ఆమె మద్రాసులో ఉంటున్నది. తన పిల్లలను మావయ్యకు పరిచయం చేసింది. చంటి వారిని ముభావంగా పలకరించాడు. రాణి తన పిల్లలను ఎత్తుకొని ముద్దాడతాడేమోనని చూసింది. కానీ అలాంటిదేమీ లేదు.

చంటి తన కూతురికి సంబంధాలు వెతుకుతున్నాడు. శంకరం దంపతులు దగ్గరుండి అన్నీ చూసుకుంటున్నారు. అంతలోనే చంటికి జబ్బు చేయటంతో ఆ ప్రయత్నాలు ప్రక్కన పడ్డాయి.

మావయ్యకు బాగాలేదని తెలిసి జ్యోతి, లక్ష్మి హుటాహుటీన వచ్చారు. చంటి తన జబ్బు విషయం తనవాళ్ళెవ్వరికీ తెలియచేయవద్దన్నాడు.

జ్యోతి, లక్ష్మి వచ్చేసరికి చంటి తన కూతురితో తలపట్టించుకుంటున్నాడు. ఇరువురూ వచ్చి చెరో కాలి దగ్గర కూర్చొని దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చారు.

చంటి కళ్ళు తెరిచి జ్యోతి చేయి స్పర్శించి కొంచెం తడబడి 'లక్ష్మి' అన్నాడు. ఆమె ఏడుస్తూ అతని గుండెలపై వాలింది. లక్ష్మి పరిస్థితీ అదే. చంటి అప్పటికే ఆస్థి పంపకాలు చేసేసాడు. తన బిడ్డను శంకరం దంపతుల కప్పజెప్పి ఆమె పేర మూడో వంతు వాటా, జ్యోతీ, లక్ష్మీ ఇద్దరిపేరున మిగిలిన ఆస్థి చెరిసగం రాయించాడు. తన బిడ్డ పెళ్ళి బాధ్యతను శంకరం దంపతులకు అప్పచెప్పాడు.

అతను చివరిఘడియలు లెక్కపెట్టుకుంటున్నాడు. జ్యోతిని, లక్ష్మిని పిలిచి చెరోబుగ్గపై ముద్దుపెట్టమని సైగ చేసాడు. వారిద్దరూ ఏడుస్తూనే మావయ్య చివరి కోరిక

నెరవేర్చారు. చంటి కళ్ళ నుండి కన్నీరు జాలువారింది. జ్యోతి చేయిని, లక్ష్మి చేయిని చెరో చేత్తో గుండెలకదుముకొని గట్టిగా పట్టుకున్నాడు.

చంటి శ్వాస విడిచాడు. ఆ గదంతా గుండె పగిలే రోదనలతో నిండిపోయింది.

జరగాల్సిన కార్యం జరిగిపోయింది. ఇంట్లో అందరూ మౌనంగా ఉన్నారు. లక్ష్మి ,మావయ్య కుర్చీని, అతను రాసిన పుస్తకాలను చూసి కన్నీళ్ళు పెట్టుకుంది. అల్మరాలో నున్న మావయ్య డైరీ తీసి చూసింది. అందులో తనదీ, అక్కదీ ఫోటో ఉంది. ఆమె ఫోటో పట్టుకొని మంచంపై పడుకొంది. గోడకి తగిలించిఉన్న మావయ్య ఫోటో చూసింది. కన్నీళ్ళు కారి చెవిలోకి పోయాయి. చేతిలోని ఫోటోని వెనక్కి తిప్పి చూసింది. అక్క వెనుక చిట్టి అని, తన వెనుక చిన్ని అని రాసుంది. వారి గురించి మావయ్య ఎప్పుడూ చెప్పనే లేదు.

చంటి తమ పేర్లు ఉచ్చరించేటప్పుడు ఎందుకు తడబడతాడో ఆమెకు అప్పటికీ అర్థం కాలేదు.



# ప్రళయంలో పదనిసలు

మునుపెన్నడూ రానంత వరద వచ్చింది. ప్రళయమే వచ్చింది. చెట్లు, పుట్టలేం ఖర్మ! ఏకంగా ఊళ్ళు, నగరాలే నాశనమైపోయాయి. జనాలంతా కొట్టుకుచచ్చిపోయారు. తన్నుకొని కాదు. నీటిలోనే కొట్టుకు చచ్చారు. ఎంతమంది చనిపోయారో లెక్కించి నిర్ధారించాల్సిన అధికారులూ కొట్టుకొని పోయారు. నదులు, సముద్రాలు అన్నీ ఇష్టానుసారం పొంగి రాజ్యమేలటానికన్నట్లు తిరుగుబాటు చేసి నేలను కావలించుకున్నాయి. ఎక్కడో నూటికొక్కడు బాగా ఈత వచ్చిన వాడు మాత్రం బతికి నీట్లో పడ్డాడు.

ఓ సైంటిస్టు ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకొని ఈదుకుంటూ ఆధారం కోసం వెదుకుతున్నాడు. అతడి నోట్లో ఏదో కాగితాల కట్ట ఉంది. పాపం అతడు వెతుకుతున్న ఆధారం ఏదీ దొరకటం లేదు. నీళ్ళు ఆకాశం కంటే నిండుగా ఉన్నాయి. అయినా పట్టుదలగా సైంటిస్టు ఈదుతున్నాడు. అతడికి దారిలో జ్ఞాని కలిసాడు. సైంటిస్టుకి జ్ఞానితో మాట్లాడాలనిపించింది. అంతలోనే నోట్లోని కాగితాల కట్ట గుర్తొచ్చి ఆగిపోయాడు. జ్ఞాని మటుకు తన మానాన తను ఈదుకుంటు పోతున్నాడు.

కొంచెం సేపు ఈదాక సైంటిస్టుకి ఎదురుగా ఓ గదంత నేల కనపడింది. అతను ఆత్రంగా నేలను చేరాడు. అంతలోనే జ్ఞాని సంగతి గుర్తొచ్చి అతడ్ని పిలిచాడు.

"Oh man! come here" చప్పట్లు చరుస్తూ అరిచాడు సైంటిస్టు. జ్ఞాని అక్కడ నేల కనపడటంతో, ఈదుకుంటూ నేలను చేరుకొని సైంటిస్టు వైపు కృతజ్ఞతాపూర్వకంగా నవ్వాడు.

"Do you know English?" ప్రశ్నించాడు సైంటిస్టు.

జ్ఞాని మౌనంగా గాల్లోకి చూస్తూ ఉండిపోయాడు.

"ఓహ్! సరే! ఈ కట్ట ఉంది చూసావ్?" తన చేతిలో కాగితాలని చూపించి అన్నాడు. " ఇందులో మహామహా గొప్ప సైంటిస్టులు కనిపెట్టిన వివరాలున్నాయి. ఈ పరిస్థితులన్నీ చక్కబడ్డాక నేను ఒక కొత్త శకాన్ని సృష్టించబోతున్నాను"

జ్ఞాని మౌనంగా తలదించుకొని తన మొలవైపు చూసుకున్నాడు. అక్కడ ఒక భరిణి ఉంది.

"What's that?" సైంటిస్టు ప్రశ్నించాడు.

సమాధానం చెప్పకుండా మూత తీసి చూపించాడు జ్ఞాని. అది ఖాళీగా ఉంది. కానీ సైంటిస్టుకి అతను తనను మోసం చేసాడనిపించింది. అందులో ఏదో ఉన్నా తనకు చూపించకుండా మాయ చేసాడనిపించింది.

నీళ్ళు అక్కడి నేలను నెమ్మదిగా తాకుతున్నాయి.

" ఈ కట్ట ఉంది చూసావూ! ఇందులో ఎన్నో రకాల పరిశోధనల ఫలితాలున్నాయి. వీటి ద్వారా నేను భూమ్మీదే స్వర్గాన్ని సృష్టించగలను. ఒక విలాసవంతమైన జీవితాన్ని సృష్టించగలను".

"నా దగ్గర కొంచెం రొట్టె ఉంది. మీరు తింటారా?" అడిగాడు జ్ఞాని.

తను గొప్ప విషయాన్ని చెప్తుండగా ఆసక్తి కనబరచకపోవటమే కాక మధ్యలోనే తుంచి, రొట్టె గురించి మాట్లాడటం సైంటిస్టుకి చికాకు తెప్పించింది.

"ఈ కట్ట ఉంది చూసావూ? వీటి సహాయంతో నేను మానవుడికి నిద్రాహారాల అవసరాలే లేకుండా చేయగలను." గర్వంగా బదులిచ్చాడు సైంటిస్టు.

నీళ్ళు కొంచెం కొంచెంగా చుట్టిముట్టి చిన్న అడుగులతో ముందుకొస్తున్నాయి. చీకటిపడింది.

" ఈ కట్ట ఉంది చూసావూ?" సైంటిస్టు జ్ఞానివైపు చూసాడు. అతడప్పటికే నిద్రపోయాడు.

"హు! country man" మూతి వంకరగా పెట్టినవ్వుకున్నాడు సైంటిస్టు.

సైంటిస్టుకి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టటం లేదు. నెమ్మదిగా కమ్ముకుంటున్న వరదనీరు, అప్పటికే కమ్ముకున్న చీకటి అతడ్ని ప్రశాంతంగా ఉండనివ్వటం లేదు. అసహనంగా జ్ఞాని వైపు చూసాడు. జ్ఞాని గాఢ నిద్రలో ఉన్నాడు.

"Poor fellow!" నిట్టూర్పువిడిచి అతడి మొలవైపు చూసాడు సైంటిస్టు. అక్కడ భరిణి ఉంది. తనకు ఆ భరిణి ఖాళీగా చూపించటం గుర్తుకు వచ్చింది. అందులో ఏముందో చూద్దామనిపించింది. నెమ్మదిగా జ్ఞానిని చేరుకున్నాడు. వణుకుతున్న చేతితో ఆ భరిణి స్పర్శించాడు. జ్ఞాని కొంచెంగా కదిలాడు.

సైంటిస్టుకి భయం వేసింది. తను చులకన ఐపోతానేమోనని. ఒక్క ఉదుటన భరిణి లాక్కొని ఏమీ ఎరగనట్టు రెండో ప్రక్కకు తిరిగిపోయాడు. జ్ఞాని మళ్ళీ కొంచెం కదిలాడు.

సైంటిస్టుకి మనసులో సిగ్గుగా ఉంది.

"ఛ ఛ! అనవసరంగా లాగాను. అయినా ఆ dirty country rougue దగ్గర ఏముంటుంది? ఇప్పుడు అతడికి ఈ విషయం తెలిస్తే తల ఎలా ఎత్తుకునేది?' ' మనసులో తిట్టుకున్నాడు.

అయితే జ్ఞాని మాత్రం లేవలేదు.

సైంటిస్టు ఊపిరి పీల్చుకొని ఓ అరగంట ఆగి తరువాత భరిణి తీసి చూసాడు. ఏమీ కనపడలేదు.

"Its already dark now. I will see this later in the day time." మనసులో అనుకొన్నాడు.

నీళ్ళు నెమ్మదిగా ఆక్రమిస్తున్నాయి.

భరిణి జేబులో వేసుకున్నాడు సైంటిస్టు. అతనికి నిద్రపట్టింది. ఉదయం జ్ఞాని లేపినంత వరకు లేవనే లేదు.

"మీ కాగితాలు ఇక్కడ వదిలివేసారు. నే చూడకుంటే గాలికెగిరి కొట్టుకు పోయుండేవి" సైంటిస్టు కాగితాలను అప్పజెప్పాడు జ్ఞాని.

"Thanks! Thanks a lot" కాగితాలని తీసుకొని జ్ఞాని మొలవైపు చూసాడు. అక్కడ భరిణి యధాతథంగా ఉంది. సైంటిస్టుకి ఏమీ అర్థం కాలేదు.

"ఇతడు లేనప్పుడు భరిణిలో ఏముందో చూడాలి" రాత్రి దొంగిలించిన భరిణిని తడుముకుంటూ అనుకున్నాడు.

నీళ్ళు పూర్తిగా కమ్ముకోవటం ప్రారంభించాయి.

"ఇంక ఇక్కడ ఉండలేం" సైంటిస్టు అన్నాడు.

"నా దగ్గర కాస్త రొట్టె ఉంది. తింటారా?" జ్ఞాని అడిగాడు.

సైంటిస్టుకి చిన్నగా కోపం వచ్చింది.

"తిన్నట్టుగానే ఉంది మన పరిస్థితి." అంటూ కాగితాల కట్టి నోటితో కరచి పట్టుకొని మళ్ళీ ఈతకు సిద్ధమయ్యాడు.

నీళ్ళు పూర్తిగా ఆక్రమించాయి.

సైంటిస్టు, జ్ఞాని మౌనంగా ఈదుతున్నారు. సైంటిస్టుకి జ్ఞాని మొలలో భరిణి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. ఈదుతూ మళ్ళీ జేబుతడుముకున్నాడు. అందులో రాత్రి తాను దొంగిలించిన భరిణి వుంది. "బహుశా పొద్దున్న లేచాక ఇంకొకటి కట్టుకున్నాడేమో!"

సైంటిస్టుకి తన గొప్పతనం నిరూపించుకోవాలనిపించింది.

"ఈ కట్ట ఉంది చూసావ్?" అతని మాట పూర్తవ్వక ముందే కాగితాలకట్ట వరదనీట్లో పడిపోయింది.

"Oh no! my God! my inventions! my discoveries!" కేకలు పెట్టాడు సైంటిస్టు. అప్పటికే వరదనీరు కాగితాలని దొరకబుచ్చుకొని రిలే పరుగు పందెంలో పరిగెత్తినట్టు చాలా దూరం పోయింది.

సైంటిస్టు దుఃఖం ఆపుకోలేకపోయాడు. బైటకు ఏడ్చేసాడు. కన్నీళ్ళు వరదనీట్లో కలిసిపోయాయి.

"What about my dream world?" ఏడ్చుకున్నాడు సైంటిస్టు.

అతనికి తాను నిర్వీర్యుడనైనట్లుగా అనిపించింది.

ఇప్పుడు తను సామాన్యుడనైపోయానని భయపడ్డాడు.

"బాధపడకండి" ఓదార్చాడు జ్ఞాని.

" నా దగ్గర కొంచెం రొట్టె ఉంది తింటారా?"

సైంటిస్టుకి విపరీతమైన ఆగ్రహం వచ్చింది.

"Stop it! stop talking about your blody bread." ఏడుస్తూ అన్నాడు.

జ్ఞాని మౌనంగా ఉండిపోయాడు.

సైంటిస్టు తాను జ్ఞానికంటే సామాన్యుడనైపోయానని ఆత్మన్యూనతా భావం

తెచ్చుకున్నాడు.

ఇద్దరూ మౌనంగా ఈదుతున్నారు. కాకపోతే సైంటిస్టు మధ్యమధ్యలో నెమ్మదిగా చిన్న స్వరంతో ఏడుస్తున్నాడు.

కొంచెం సేపు ఈదాక వారికొక దుంగ కనపడింది. ఇద్దరూ దుంగవైపు ఆనందంగా చూసారు.

జ్ఞాని తనలో తను మనసులో ఇలా అనుకున్నాడు-

"ప్రభూ! నా సహచరునికి ఆధారాన్నిచ్చావు. మరినాకు లేదా?"

సైంటిస్టు ఇలా అనుకున్నాడు-

"Oh God! you gave me a support. But what about my partner?"

ఇద్దరూ దుంగవైపు చూస్తు, దానివైపు ఈదుతున్నారు. ఇంకా ఎవ్వరూ దాన్ని అందుకోలేదు.

ఇంతలో ఒక పెద్ద అల భయంకరంగా, అమితవేగంతో వారి వెనుకగా రావటం గమనించారు.

సైంటిస్టుకి భయం వేసింది. ఇక తను ఆలస్యం చేస్తే దుంగ తనకు దక్కదని అనుకున్నాడు. జ్ఞాని కూడా దుంగను చేజిక్కించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడనిపించింది. వెంటనే జ్ఞానిని ప్రక్కకు తోసేసాడు. ఆతృతతో గభాల్న దుంగని తన చేతుల్లో తీసుకొని కావలించుకున్నాడు.

తమ వెనుక వచ్చిన ఆ భయంకరమైన అల కమ్మింది. అలతో పాటుగా జ్ఞాని అంత ఎత్తున ఎగసాడు. అక్కడనుండే అతను-

"మిత్రమా! ఇది ఉంచు. ఉపయోగపడుతుంది." అంటూ తన మొలకు ఉన్న భరిణె తీసి సైంటిస్టు వైపు విసిరాడు.

అల క్రిందికి ఉరికింది. జ్ఞాని కూడా క్రిందికి జారాడు.

భరిణె తేలుకుంటూ సైంటిస్టు వద్దకు వచ్చింది. ఒక చేత్తో దుంగ పట్టుకొని రెండో చేత్తో భరిణె తెరచి చూసాడు ఖాళీగా ఉంది.

“హు! empty box”

అంతలోనే రాత్రి దొంగిలించిన భరిణి గుర్తొచ్చింది.

అది తీసి, తెరచి చూసాడు.

అదీ ఖాళీగా ఉంది.

"He made me a fool" తిట్టుకుంటూ దూరంగా కనపడుతున్న జ్ఞాని (శవమో లేక బ్రతికే ఉన్నాడో తెలియదు) వైపు విసిరేసాడు. జ్ఞాని మొలలో ఇంకా మూడో భరిణి ఉంది. దూరం ఎక్కువ కావటంతో అది సైంటిస్టుకి కనపడటం లేదు.

వరద ఉధృతి మునుపటికంటే కొంచెం తగ్గింది.

దుంగపట్టుకొని ఉన్న సైంటిస్టు దగ్గరకు జ్ఞాని పట్టుకొని తెచ్చిన రొట్టెముక్క తేలుకుంటూ వచ్చింది.

సైంటిస్టుకి తాను రెండ్రోజులనుంచీ ఏమీ తినలేదని గుర్తుకు వచ్చింది.

ఆత్రంగా రొట్టెనందుకొని ఆబగా తిన్నాడు.



# తీరని కోరికలు

"ఇప్పటికి పదకొండు రోజులు అయ్యాయి". పదకొండు అన్నమాట అనుకున్నప్పుడు ఉబ్బిఉన్న రమణ కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి. తల్లిలేని జీవితాన్ని తాను కనీసం ఊహించుకొనైనా ఉండడు. ఇప్పుడా వాస్తవాన్ని భరించాల్సి వచ్చింది.

ఈ పదకొండు రోజులుగా అతను తిండి కూడా సరిగ్గా తినటం లేదు. బలవంతాన ఎవరో ఒకరు బ్రతిమిలాడి తినిపిస్తున్నారు. రమణకి వాళ్ళను చూస్తే చిరాగ్గా ఉంది.

'తన ఆలోచనల్లో తనని వదలటం లేదు'

కనీసం అమ్మ శవం దగ్గర కూడా ప్రశాంతంగా ఏడవ లేకపోయాడు. నిశ్శబ్దాన్ని భంగం కలిగించే బంధువుల రోదనలు అతడ్ని అప్పుడు కూడా స్థిమితంగా ఏడవనీయలేదు.

అతనికి ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి. ఇంట్లో పదిమంది మధ్య అతని ఆలోచనలు సాగటం లేదు. తీరిగ్గా కూర్చుని ఆలోచించుకోవాలని ఉంది. ఒంటరిగా!

"బయటకు వెళ్ళాలి" గట్టిగా నిశ్చయించుకున్నాడు.

అంతలోనే నిరాశగా కాళ్ళ వైపు చూసుకున్నాడు. 'నడుంక్రింద రెండు తోలు తిత్తుల్లా వేలాడుతున్నకాళ్ళు, సహకరిస్తాయా?'

అతనికి ఏడుపొచ్చింది. అసహాయుడై ఏడ్చాడు. "ఐనా సరే! రిక్షాలోనైనా వెళ్ళాలి."

బంధువొకాయనతో రిక్షా తెప్పించుకున్నాడు.

"ఎక్కడికి?" అడిగాడా బంధువు.

"అమ్మదగ్గరకి" ఠక్కున అబద్ధం చెప్పేసాడు.

అక్కడ ప్రతిఫలించిన అర్థం శ్మశానానికని.

ఆ బంధువేమీ మాట్లాడలేదు.

రమణ రిక్షా ఎక్కి సినిమా హాలుకి పదమన్నాడు.

రమణకి సినిమాకి వెళ్ళాలని ఎప్పటినుంచో కోరికగా ఉండేది. ఎప్పుడో పదోయేట వెళ్ళినప్పుడు, డేకురుకుంటూ వచ్చిన అతన్ని చూసి కొంతమంది ముసిముసిగా నవ్వుకున్నారు.

వెంటనే సినిమా చూడకుండా-ఏడ్చుకుంటూ-వెనక్కివచ్చేసాడు. అంతే ఈ పదేళ్ళలో మళ్ళీ సినిమాకి వెళ్ళలేదు. అమ్మ బలవంతం పెట్టినా కూడా!

ఇప్పుడు సినిమాకి వెళ్ళటానికి కూడా కారణం లేకపోలేదు. ఈ పదకొండు రోజులూ రమణ తన భవిష్యత్తు గురించే ఎక్కువ ఆలోచించాడు. అతనికంతా శూన్యంగా కనిపిస్తోంది. తన బంధువులెవరూ ఇక్కడ శాశ్వతంగా ఉండరని తెలుసు. అలా అని తనను వారితో తీసుకుపోరు. తీసుకుపోయినా తన క్రింద చెయ్యాల్సి వచ్చినందుకు కొన్నాళ్ళుపోతే విసుక్కుంటారు. తన అభిమానాన్ని కించపరచే ఒక్కమాటకూడా అతడు సహించలేడు. పోనీ స్వతంత్రంగా బ్రతుకుదామంటే ఆస్తులు కానీ, సంపాదన కానీ ఏవీ... లేవు.

కొద్దిక్షణాల క్రితం తన బంధువు ఎక్కడికని అడిగినప్పుడు చెప్పిన సమాధానం గుర్తుకువచ్చింది.

"ఔను! నిజంగా అమ్మదగ్గరకే పోతా!"

ఎంత ఆలోచించినా రమణకి చావు తప్ప వేరే పరిష్కారం కనబడటం లేదు. అతనికి చావాలని లేదు. తన బ్రతుకు దుర్భరం కాకూడదని చావాలనుకుంటున్నాడు. ఇన్నాళ్ళూ తల్లి అండవల్ల బ్రతుకు ఈడ్చగలిగేవాడు. ఇప్పుడలాకాదు. అందుకే బాగా ఆలోచించి చావాలో వద్దో తేల్చుకోవాలని అనుకున్నాడు. అయితే చచ్చేలోపు ఏవైనా తీరని కోరికలు ఉన్నాయా అని అలోచిస్తే సినిమా గుర్తొచ్చింది.

హాలు వచ్చేసింది. రమణ దిగి డేకురుకుంటూ లోనికి వెళ్ళాడు. కొంతమంది అతనివైపు వింతగా చూస్తున్నా పట్టించుకోలేదు.

టికెట్టు తీసుకొని లోనికి వెళ్ళబోతూ పక్కన కేంటిన్‌లో సిగరెట్లు చూసాడు. అతనికొక సిగరెట్టు కాల్చాలనిపించింది. కొంచెం సేపు తటపటాయించి ఎందుకో భయపడి హాల్లోకి వచ్చేసాడు.

"సినిమా చూస్తూ ఏమీ ఆలోచించకూడదు." సీట్లో కూర్చుంటూ నిశ్చయించుకున్నాడు.

సినిమా మొదలైంది.

ఓ అయిదు నిముషాలు అనుకున్నట్టే సినిమా చూసాడు. హీరో పదిమందిని చితక్కొడుతున్నాడు. అదేంటోగానీ హీరో వేసిన పథకాలన్నీ ఊహించినవి ఊహించినట్టుగా

తు.చ. తప్పకుండా ఫలిస్తున్నాయి.

రమణకి అమ్మ గుర్తుకు వచ్చింది. తన అవిటి శరీరాన్ని, తల్లి అక్కున చేర్చుకొని ప్రేమతో ముద్దాడుతున్న దృశ్యం తెరపై కనపడింది.

అతడికి తండ్రి లేడు. చనిపోయాడని అమ్మ చెప్పింది. అందుకే అమ్మ బొట్టుకూడా పెట్టుకోదు. రమణకి స్నేహితులు కూడా లేరు. ఒకే ఒక్కడు ఉండేవాడు స్కూల్లో. చాలామంది తోటిపిల్లల్తో పరిచయమున్నా రమణ వారిని స్నేహితులుగా భావించలేకపోయాడు. అందుకు కారణం వారి ప్రవర్తనే! రమణకి, వారికీ - తనకీ మధ్య ఏదో అగాధం ఉన్నట్లే అనిపించేది. వాళ్ళు మాట్లాడితే తన దగ్గర నటిస్తున్నట్లే అనిపించేదతనికి. రాజు ఒక్కడే తన అవిటితనాన్ని గ్రహించనివాడిగా రమణ నమ్మేవాడు.

రమణ ఇంటి ప్రక్కనే స్కూలు. ఆ స్కూలు ప్రక్కనే రాజు వాళ్ళుండే ఇల్లు. ఒక రోజు రాజు పుట్టిన రోజునాడు క్లాసులో అందరికీ చాక్లెట్లు పంచాడు.

"సాయంత్రం పార్టీ ఉంది. మళ్ళీ మీ ఇంటికి వచ్చి పిలుస్తాలే" అన్నాడు రాజు మిగిలిన స్నేహితులతో, రమణ వింటూండగా.

రమణ ఇంటికి వచ్చి తల్లికి విషయం చెప్పి కానుకేదైనా ఇస్తానని పట్టుబట్టాడు. తల్లి సరేనని బజారుకి వెళ్ళబోతే తనూ వస్తానని పేచీ. తప్పని సరై రిక్షాలో వెళ్ళి ఓ పదిహేను రూపాయల పెన్ను కొని ఇంటికి ఆనందంగా వచ్చాడు. అయితే పార్టీ సమయం దాటినా ఎవ్వరూ పిలవటానికి రాలేదు. ఒకవేళ తాము బయటకు వెళ్ళినప్పుడు వచ్చుంటారేమోనని ఇస్త్రీ బట్టలు వేసుకొని రమణ ఒక్కడే వెళ్ళాడు. పార్టీ అప్పటికే మొదలైంది.

రమణకి ఏదో కోలాహలం వినపడింది. ముందుకి చూసాడు. తెరపై "విశ్రాంతి" అని ఉంది.

"ప్చ్! సినిమా చూడలేకపోయాను" బాధపడ్డాడు. అతనికి అంతవరకు జరిగిన కథ తెలుసుకోవాలని ఉంది. మొహమాటపడతూనే మూడో ప్రయత్నంలో పక్క సీట్లో కూర్చున్న వ్యక్తిని అడిగాడు 'ఇంతవరకు జరిగిన కధ చెప్ప' మని.

అతనో క్షణం ఎగాదిగా చూసి బయటకు వెళ్ళిపోయాడు " ఈ రెండో భాగమైనా చూడాలి" మనసులో అనుకున్నాడు.

సినిమా మొదలయ్యింది. తెరపై హీరో హీరోయిన్లిద్దరూ పాటపాడుకుంటున్నారు.

హీరో తన కాళ్ళని గాలిలో తిప్పుతూ అద్భుతంగా డాన్సు చేస్తున్నాడు. రమణ తన కాళ్ళవైపు చేసుకున్నాడు. సరిగ్గా అమ్మ చనిపోకముందు రోజునే అదే కాలికి దెబ్బ తగిలితే అమ్మ కట్టుకట్టింది. అమ్మ ఎందుకనో ఎవ్వరికీ చెప్పకుండా అంత హఠాత్తుగా చచ్చిపోయింది. తనని దిక్కులేని వాడ్ని చేస్తూ.

అతనికేదో మరచిపోయాననిపించింది. ఓ అయిదు నిముషాలు తీవ్రంగా ఆలోచించాక గుర్తుకువచ్చింది. ఆ రోజు తన స్నేహితుని పుట్టినరోజు పార్టీకి వెళ్ళాడు. ఆ విషయం ఇందాక సగంలోనే ఆపేసాడు. ఆ విషయమే ఏదో మరచిపోయావంటూ బుర్రతొలిచేస్తుంది. పార్టీ రోజు గుర్తుకు తెచ్చుకున్నాడు. గేటు దగ్గర నుంచున్న తనను వింతగా చూస్తున్నారు. అది తనకి అలవాటే. అయితే రాజు వచ్చి "అరే! నువ్వెందుకు వచ్చావ్? నేనే స్వీట్స్ పంపించేవాడ్ని కదా! నీకెందుకీ శ్రమ?" అంటూ పనివాడిచే స్వీట్సు ఇప్పించి లోనికి రానీయకుండానే పంపించేసాడు. రోజూ నాలుగుసార్లైనా తను స్కూలుకి తిరగటం చూస్తున్న రాజుకి ఇది శ్రమ అని ఎందుకు అనిపించింది?, ఒక వేళ తాను రావటం ఇష్టం లేదేమో? స్వీట్లకోసం వచ్చానన్నట్టు ప్రవర్తించాడు.

రమణ జేబు తడుముకున్నాడు. పెన్ను ఇవ్వటం మరచిపోయాడు. ఎందుకో వెనక్కి వెళ్ళి ఇవ్వాలనిపించలేదు.

ఏడ్చుకుంటూ వచ్చిన రమణని చూసి అమ్మ అంది.

"పోన్లే ఊరుకో! అయినా ఆ పెన్ను నీ దగ్గర ఉంటేనే బాగుంటుంది. నాకు చాలా నచ్చింది." అని. ఇక ముందు ఇలా ధైర్యం చెప్పేదెవరు?

రకరకాల ఆలోచనలు అతడ్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

అతనికి ఆలోచనల మీద విసుగు పుట్టింది. "తొందరగా చనిపోతే పోలా" చిరాగ్గా అనుకున్నాడు.

అతనికి మళ్ళీ ఏదో సందడిగా వినిపించింది. తెరపై "శుభం" అని ఉంది. ప్రక్క సీట్లో వ్యక్తిని అడిగాడు.

"సినిమా అయిపోయిందా?" అని.

అతనో క్షణం మళ్ళీ ఎగాదిగా చూసి లేచి వెళ్ళిపోయాడు.

రమణ అందరికీ వెనకన దేకురుకుంటూ వస్తున్నాడు. అతనికి చాలా అసంతృప్తిగా,

బాధగా ఉంది. తన చిరకాల కోరిక కూడా నెరవేరలేదు.

బయటకు వచ్చాక అతనికి మళ్ళీ ఏదో మరచిపోయాననిపించింది. తను ఏదో చెయ్యాలనుకున్నాడు. కానీ గుర్తురావటం లేదు. ఏదో గుర్తుకువచ్చినట్లే వచ్చిపోతోంది. ఏదో చెయ్యాలని నిర్ణయించుకున్నట్లు మాత్రం గుర్తుంది. తన చావు గురించా? ఉహు. ఇంకేదో విషయం.

ఆలోచిస్తూ రమణ కేంటీన్ వైపు చూసాడు.

"ఔను గుర్తుకొచ్చింది. సిగరెట్ తాగాలి"

తేలిక పడిన గుండెతో కేంటీన్ వైపుసాగాడు.



# పనికిరాని ఆదర్శాలు.

"టికెట్. . . . టికెట్. . . ."

ఆ కేకకు మళ్ళీ ఈ లోకంలోకి వచ్చిపడ్డాను. కంగారుగా జేబు తడుముకొని రెండు రూపాయల నోటిచ్చి టికెట్ తీసుకొని మళ్ళీ ఆలోచిస్తూ కూర్చున్నాను.

"ఛ ఛ! వెధవ ఉద్యోగం కోసం అడ్డమైన వాడికాళ్ళూ పట్టి ప్రాధేయపడాల్సి వస్తోంది. లేకపోతే తానేమిటి ఆ సుధీర్ గాడి దగ్గరకు జాబ్ అడుక్కోవటానికి వెళ్ళటమేమిటి? విడ్డూరం కాకపోతే?"

ఆలోచిస్తూ గతంలోకి వెళ్ళాను.

సుధీర్ నేనూ చిన్నప్పటి నుంచీ ఒకే చోట పుట్టి పెరిగిన వాళ్లం. ఒకే స్కూల్లో చదువుకున్నాం. చిన్నప్పుడు నాకెక్కువ మార్కులు వచ్చాయని సుధీర్ ఎన్నిసార్లుకుళ్ళికుళ్ళి ఏడ్చాడో లెక్కేలేదు. ఆ రోజు నాకు 7th లో వాడి కన్నా ఇరవై మార్కులు ఎక్కువ వచ్చాయని జ్వరం పెట్టుకోలేదూ? నా మీద వాడు అసూయ పెంచకోవటంతో నాకు వాడి మీద ద్వేషం పెరిగింది.

నిజానికి నేను కష్టపడి చదివేవాడ్ని కాదు. వాడు మాత్రం బుర్ర బద్దలు కొట్టుకొనేట్టు అర్ధరాత్రివరకూ చదివేవాడు. అంత చదివినా వాడికి నాకన్నా తక్కువ మార్కులు వచ్చాయని ఎంత ఆనందపడే వాణ్ణో అప్పుడు. అయితే నెమ్మదిగా వాడు నన్ను మించిపోయాడు. 10thలో వాడికి నాకన్నా 20 మార్కులు ఎక్కువ రావటంతో కుళ్ళుకోవటం నా వంతయ్యింది.

"కిర్. . .ర్. . . ర్' మని సడెన్ బ్రేకు పడింది. ఎవరో స్టూడెంటు గాబోలు నాపక్కనే కూర్చున్నాడు. అతడు పట్టుకున్న ఒక బుక్ వచ్చి నా ఒళ్ళో పడింది.

"సారీ అండీ" సన్నగా గొణిగాడు.

"ఫరవాలేదు" అంటూ బుక్ తీసి చూసాను.

'Physics notes'.

ఆ అబ్బాయి నా చేతుల్లోంచి పుస్తకాన్ని లాక్కున్నాడు. అప్పుడు 10th Classలో నేనేమి చేసానో గుర్తుకు వచ్చింది. ఆ రోజు సుధీర్ గాడికి తెలియకుండా వాడి ఫిజిక్స్ నోట్సు దొంగిలించాను. నిజానికి ఆ నోట్సు నాకు అవసరం లేదు. అయినా సుధీర్ గాడికి కూడా ఉండకూడదు అంతే!

ఆ తర్వాత ఆ నోట్సు కోసం వాడు జ్వరం పెట్టుకోవటం అన్నీ షరామామూలే. అది చూసి పండుగ చేసుకున్నాను. కానీ ఏం లాభం 10thలో వాడికే ఎక్కువ మార్కులు వచ్చాయి.

అదేంటో గానీ, తర్వాత నుండి వాడు నన్ను పోటీగా భావించేవాడే కాదు. తనకన్నా బాగా మార్క్సు వచ్చేవాళ్ళతో పోటీపడేవాడు. నన్ను వాడు పట్టించుకోవటం తగ్గేసరికి నాకు ఇంకా ద్వేషం పెరిగిపోతుండేది. ఇంటర్ ఎగ్జామ్స్ రాసే ముందు, examination హాల్లో వాడు పేపరు తీసుకొనక ముందు, దేవుళ్ళకు దణ్ణం పెట్టుకుంటుండగా నే వెళ్ళి ఏమన్నానని?

"ఒరేయ్ నీ ముఖం చూస్తే జాలేస్తుంది. ఆఫ్టాల్ ఎగ్జామ్ కోసం అంత ఉద్రేకం తెచ్చుకోవటం దేనికిరా? నాలా ఫ్రీగా ఉండలేవు? ఎందుకలా గొర్రెలా ప్రవర్తిస్తావ్?"

వాడు మాత్రం జవాబు చెప్పలేదు. చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. "నువ్వంతే ఈ జన్మకు బాగుపడవు" అనుకుంటూ ఆ విషయం అంతటితో ఆపేసాను.

బస్సు ఆగింది. నే దిగే చోటు వచ్చేసింది. ఇక్కడకు సుధీర్ వాళ్ళ ఇళ్ళు దగ్గరేనట.

జేబులో అడ్రస్ తడుముకొని బస్సుదిగా. ఎడ్రస్ చూసి ఎటు వెళ్ళాలో నిర్ణయించుకొని మళ్ళీ ఆలోచనల్లో పడ్డాను.

ఆ రోజుEngineering entrance results వచ్చింది. వాడికి మంచి

ర్యాంక్ వచ్చింది. నా నెంబరే లేదు. ఇద్దరం ఒక్క దగ్గరే కోచింగ్ తీసుకున్నాం. నేను సరదాగా చదవకుండా కాలం గడిపేసాను. వాడు కష్టపడ్డాడు సాధించాడు. మొత్తానికి సీటు సంపాదించాడు. ఎక్కడో వరంగల్‌లో సీటు వచ్చింది వాడికి. వెళ్ళే ముందు నన్ను కలిసాడు.

'వస్తా(న్రా!' అని చెప్పటానికి వచ్చినవాడు ఊరికే ఉండకూడదూ? ఒక వెధవ సలహా ఇచ్చి పారేసాడు. నాకు ఇంకా ఆ మాటలు చెవిలో గింగిరుమంటున్నాయి.

"ఒరేయ్! నాలైఫ్ సెటిల్ అయ్యింది. ఇప్పటికైనా నువ్వు కొంచెం జీవితం గురించి ఆలోచించి శ్రద్ధగా చదువుకో! నేన్నీకు చెప్పేవాడ్నా అని కోపగించుకోకు"

దానికి నేనేమన్నానని?

"ఒరేయ్! నువ్వు నా దృష్టిలో చాలా అల్పుడివి. నీకొక సరైన వ్యక్తిత్వం కానీ, ఆదర్శం కానీ లేవు. ఉన్నా చాలా స్వల్ప పరిధిలో ఉన్నాయి. నేన్నీలా కాదు. అంతెందుకు, ఇంత చదువు చదివి నువ్వేం చేస్తావు? ఓ పెద్ద ఉద్యోగం. నిజానికి నీవా ఉద్యోగం సంపాదన కోసమే కోరుకునేది. అయితే నేనా సంపాదన నా తెలివి తేటలతో చదువుకోకుండా ఆర్జించగలను. నేను కాకపోతే నా బాటలో నడిచే మరొకడు. నీలా చదువుకున్న వాళ్లందరూ సంపాదించలేనట్లే నాలాంటి వాళ్లల్లోనూ కొందరికి అపజయాలు ఉంటాయి కదా! నిన్ను చూస్తే జాలేస్తుంది. నీలాంటి వాళ్ళ ఆశయాలు, వ్యక్తిత్వాలు ఇంత స్వల్ప పరిధిలో ఎందుకు బంధింపబడతాయో అర్థం కాదు. ఒక రకంగా చూస్తే నీవలా ఉ[illegible]ం నాకూ ఆనందమే. కానీ పైశాచిక ఆనందం. ఎందుకంటే నీలాంటి వాళ్ళందరూ నాకు బానిసలు. మీరందరూ బాగా చదివి ఆదర్శాలూ, వ్యక్తిత్వాలూ అంటూ లేకుండా మిగిలి[illegible]ారి విలాసాల కోసం పాటు పడతారు. మేం కష్టపడకుండా మా తెలివి తేటలతో వృద్ధిల[illegible] వచ్చి, మీరు శ్రమించి అందించిన విలాసాల్ని అనుభవిస్తాం. మీరూ అనుభవిస్తారు. [illegible] అది యాంత్రికంగా ఉంటుంది. తృప్తి ఉండదు.

ఇదంతా విన్నాకయినా నీ కర్థం అయ్యే ఉంటుంది. నీవు నాకు చెప్పేవాడివి కాదని."

మళ్ళీ చిరునవ్వే అతని సమాధానం. అప్పుడు నాకు ద్వేషం రాలేదు. ఎందుకంటే నేను చెప్పింది అంత అక్షర సత్యమని నా నమ్మకం.

వచ్చేసింది. నే వెదుకుతున్న సుధీర్ ఇల్లు వచ్చేసింది. 'ఛ ఛ' ఈ ఆలోచన్లేవీ రాకపోయినా బాగుణ్ణు. ముఖానికింత నవ్వు పులుముకొని వెళ్ళి ఎలాగోలా కాకాపట్టి మెప్పించేవాడ్ని. కానీ ఈ ఆలోచనలు వచ్చి ఏం చేసాయ్? నాలో అహాన్ని పెంచాయి. బుర్రంతా గందరగోళంగా ఉంది. నా ముఖాన్ని తిరిగి సుధీర్‌కి ఎలా చూపేది? ఆ రోజు అన్ని ఉపన్యాసాలిచ్చిన నన్ను వేళాకోళం చెయ్యడని ఎలా నమ్మేది?

అసహనంగా గేటు మీద చెయ్యి వేసాను. ఇంకా వెళ్ళాలా వద్దో నిర్ణయించుకోలేక పోతున్నాను. నా అహాన్ని వదలి లోనికి వెళ్ళాలా, లేక వెనుదిరగలా అని ఆలోచిస్తుండగా వినిపించిందొక పరిచయమైన గొంతు-

"ఎవరదీ. . .?"



# ఆశే

గోవిందానికి చాలా విసుగ్గా, చిరాగ్గా ఉంది. అంత అపరిశుభ్రమైన బస్సులో ఇంతవరకు ప్రయాణించలేదతను. బస్సంతా ఏదో దుర్గంధంతో నిండి వుంది. ఎండు చేపలవాసన కాబోలు దుర్భరంగా ఉంది. అతనుసీట్లో కూర్చున్నాడే కానీ, చూడటానికి కూర్చున్నట్టుగా లేదు. గోడకుర్చీ వేసినట్టుగా ఉంది. బాకీ వసూలుకై పంపిన తండ్రిని తిట్టుకున్నాడు.

బస్సాగింది. చుట్టుపక్కలెక్కడా కనీసం ఒక్క ఇల్లు కూడా లేని చోట ఆగింది. చొక్కా కూడా వేసుకోని ఒక ముసలాడు రెండు కోళ్ళని పట్టుకొని బస్సెక్కాడు. అతని వెనుక ఇంకొక ముసలాడు అదే అవతారంతో ఒక బస్తాని ఈడ్చుకుంటూ ఎక్కాడు. బస్సుకదిలింది. వెనుక ఎక్కిన ముసలాడు బస్తాని ఈడ్చుకుంటూ ఒక్కొక్క సీటు దాటి ముందుకు పోతున్నాడు. అతను చూడటానికి బికారిలా ఉన్నాడు. చింకి పంచెకట్టుకొని నెరిసిన జుట్టు, గడ్డంతో అపరిశుభ్రంగా ఉన్నాడు. బస్తాని ఈడ్చుకుంటూ వచ్చి గోవిందు ప్రక్కనే కూర్చున్నాడు.

గోవిందానికి చాలా1 కోపం వచ్చింది. అయినా ఏమీ చెయ్యలేక కళ్ళుమూసుకుని కూర్చున్నాడు.

"బాబూ తవరెందాకా?"

గోవిందానికి వినబడింది. అయినా చెప్పబుద్ధి కాలేదు. విననట్టుగా కిటికీ వైపు బుర్ర తిప్పేశాడు.

బస్సు మళ్ళీ ఆగింది. దిగినవాళ్ళు దిగుతున్నారు. ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. బస్సు కిటికీలో నుండి కొందరు గాండ్రించి ఉమ్మేస్తున్నారు. బీడీలు తాగుతూ కొందరు తెగ వాగుతున్నారు.

బస్సంతా దుమ్ముధూళితో నిండివుంది. కళ్ళల్లో పడుతోంది.

గోవిందు ముసిలాడు తెచ్చిన బస్తావైపు చూసాడు. చింకి బస్తాకి ముక్కలు వేసి కుట్టి వుంది. "ఏముంది బస్తాలో?"

ఏదైనా చిరుగులో నుంచి చూడటానికి ప్రయత్నించాడు. ఒక చిరుగులోనుంచి ఏదో తళుక్కున మెరిసింది.

ఈ మధ్యనే ఆ ముసలాడెక్కిన ప్రాంతంలో తవ్వకాలలో రంగురాళ్ళు దొరుకుతున్నట్టు గోవిందు విన్నాడు.

"ఒకవేళ బస్తాలో ఉన్నవి అవేనేమో?" ఓ క్షణం పాటు గోవిందానికి చెమటలు పట్టాయి. మళ్ళీ అదే చిరుగులోనుంచి జాగ్రత్తగా పరిశీలించాడు. సందేహం లేదు. గోవిందు నుదుటికి పట్టిన చెమటను చేత్తో తుడుచుకుంటూ ముసలాడి వైపు చూసాడు.

ముసిలాడు తన అరచేత్తో కన్నాన్ని కప్పటానికి ఆపసోపాలు పడుతున్నాడు.

గోవిందు మనస్సంతా ఆదోలా అయిపోయింది. బస్తాలో అంతటి విలువైన రాళ్ళు ఉన్నాయన్న విషయాన్ని అతడు జీర్ణించుకోలేకపోతున్నాడు. కొంచెంకొంచెంగా అతని మెదడు పనిచెయ్యటం మొదలు పెట్టింది. 'మట్టిని రాళ్ళని వేరుచేయలేక మొత్తం మూటకట్టి తెచ్చినట్టున్నాడు. ఎలాగయినా సరే ఆ బస్తా చేజిక్కించుకోవాలి!'

గోవిందు ముసిలాడి ముఖంలోకి చూసాడు "ఏం చేస్తుంటావ్?" అడిగాడు ముసిలాడిని.

"ఎర్రమట్టి అమ్ముతా, మొక్కలకి!" బదులిచ్చాడతడు.

గోవిందు సంభాషణ ఎలా పొడిగించాలో తెలియక మౌనంగా ఉండిపోయాడు. అతని ఆలోచనలేవీ అతన్ని మాట్లాడటానికి సహకరించటం లేదు. బస్తా చేజిక్కించుకునే

ఉపాయాలను అన్వేషిస్తున్నాయి.

బస్సు ఒక చిన్న గోతిమీదిగా వెళ్ళింది. ఆ కుదుపుకి బస్తా గోవిందు కాలిమీద పడింది. త్రుళ్ళిపడి బస్తా ఎత్తే నెపంతో చిరుగులోంచి జాగ్రత్తగా చూడటానికి ప్రయత్నించాడు. 'ఉహు' ముసిలాడు అవకాశం ఇవ్వలేదు. అయినా అప్పటికే గోవిందు ఓ నిశ్చయానికి వచ్చేసాడు. ఎలాగయినా ఆ బస్తాని కొట్టేయాలని.

గోవిందు దిగవల్సిన ఊరువచ్చింది. అయితే ముసిలాడు సీట్లోంచి కదల్లేదు. గోవిందు బస్సు దిగలేదు.

కండెక్టరు గోవిందు వైపు ఎగాదిగా చూసాడు "బాబూ మీరు దిగాల్సిన చోటు" గుర్తు చేసాడు.

"పక్కూరిలో మరో పనుంది. అక్కడికి టికెట్టీయి". చిల్లర తీసిఇచ్చాడు.

'ఛ' ముసిలాడు ఈ ఊళ్ళో దిగినా బాగుండేది తన పని మరింత సులువయ్యేది.

గోవిందు మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు. ఒక్కసారిగా అంత సొమ్ము ఏంచేసుకోవాలా? అని ఆలోచిస్తున్నాడు. ఏవేవి కొనాలో గుర్తుపెట్టుకుంటున్నాడు. మళ్ళీ మొదటికొచ్చి బస్తా చేజిక్కించుకునే పన్నాగాలు పన్నుతున్నాడు.

అతడిప్పుడు ముసిలాడిని పూర్తిగా భిన్న కోణంలో పరికిస్తున్నాడు. ముసిలాడు ఎక్కినప్పుడున్నంత ఏహ్యత ఇప్పుడు అతనిలో లేదు. ముసిలాడి దగ్గర రంగురాళ్ళున్నాయనే అనే భావన తెచ్చుకోవటంచే గోవిందులో ఆ మార్పు వచ్చింది.

బస్సు ఆగింది.

ముసిలాడు బస్తాని జాగ్రత్తగా ఈడ్చుకుంటూ దిగుతున్నాడు. గోవిందు ఆ ముసిలాణ్ణి గమనిస్తూ తన సంచిపట్టుకొని దిగాడు.

బస్సు వెళ్ళి పోయింది. గోవిందు చుట్టూ ఓసారి చూసాడు. రోడ్డు మీద ఒక్క మనిషి కూడా లేడు. తన అదృష్టానికి మురిసిపోయాడు. నెమ్మదిగా ముసిలాడిని అనుసరిస్తూ అతనితో మాట కలిపాడు.

"ఇంకా ఊరెంత దూరం?"

"అల్లదిగో ఆ కనపడేదే" ముసిలాడు జవాబిచ్చాడు.

గోవిందులో ఉత్కంఠత పెరిగిపోయింది.

హఠాత్తుగా ఓ చోట ఆగి క్రింద పడి కాలు వేగంగా ఆడిస్తూ "పాము, పాము' ' అని అరిచాడు.

ముసిలాడు బస్తా వదలి ఆదుర్దాగా గోవిందు దగ్గరకువచ్చి "కరిచేసిందా?" అని అడిగాడు.

గోవిందు ముఖంలో బాధని అభినయించి బుర్ర ఊపాడు.

ముసిలాడు పరుగులాంటి నడకతో ఊరివైపు వెళ్ళాడు.

గోవిందు తన పాచిక పారినందుకు మురిసిపోయాడు.

ముసిలాడు కనుమరుగవ్వగానే పరిగెత్తి వచ్చి బస్తా పట్టుకున్నాడు. తన సంచి గుర్తుకువచ్చి మళ్ళీ వెనక్కి వచ్చి సంచి తీసుకున్నాడు. రెంటినీ పట్టుకోవటం కుదరలేదు. సంచిని భుజానికి తగిలించి, బస్తాని పట్టుకొని తన శక్తిమేరా వేగంగా కదిలాడు.

వెనకనుండి ముసిలాడి పిలుపు వినబడింది. మధ్య దారిలోనే వెనక్కి తిరిగి వచ్చినట్లున్నాడు.

గోవిందు వేగం హెచ్చించాడు. అతని భుజానికి తగిలించి ఉన్న సంచి క్రిందకు పడిపోయింది. అందులోని బట్టలు క్రిందపడ్డాయి. గోవిందానికి వాటి గురించే ఆలోచించే

సమయం కూడా లేదు. మరింత వేగంగా బస్తా భుజాన వేసి పరుగు లంఘించుకున్నాడు.

ముసిలాడు అందుకోలేనంత దూరం వచ్చాక రొప్పుతూ ఆగి, ఆయాసం తీర్చుకొని బస్తా మూతి విప్పాడు. లోపల ఎర్రమట్టి ఉంది. చేతిని జాగ్రత్తగా మట్టిలోనుంచి లోపలికి పోనిచ్చాడు.

చేతికి ఏదో తగిలింది బైటకు తీసాడు. ఇత్తడి చెంబు, ప్రక్కకు గిరాటేసి మరికొంత సేపు ప్రయత్నించాడు. ఏమీ దొరకలేదు. ఇలా కాదని చెప్పి మట్టిని జాగ్రత్తగా రోడ్డు మీద ఒంపి వెతికాడు. అంతా మట్టే!

"మరి బస్సులో మెరిసినది ఏమయ్యివుంటుంది?"

చెంబు వైపు చూసాడు.

"ఉహు! ఇది కాదు. ఇంకేదో మెరిసింది."

"అది ఏమయ్యుంటుంది?"



# పాపం సింహాచలం

"అదిగో మళ్ళీ ఆ మర్రి చెట్టు వచ్చేస్తుంది. ఈ రోజాకూడా తప్పదేమో! సంపాదించిన సొమ్మంతా దీనికిందే తగలెయ్యవలసివస్తుంది." సింహాచలం సైకిల్ వంక చూసుకున్నాడు.

అతనిలో భయం ఎక్కువైంది.

సింహాచలం ఒక బియ్యం కొట్టులో గుమాస్తా. తన ఇంటి నుండి మూడు కిలోమీటర్ల దూరాన దుకాణం ఉంది. రోజూ సైకిల్ పై ఉదయం పదిగంటలకి పోయి సాయంత్రం ఏడప్పుడు వస్తాడు. ఇంతకుముందు లేదీ చిత్రం. ఈ మధ్యనే వింతగా ఆ మర్రి చెట్టు దగ్గరకు వచ్చేసరికి అతని సైకిల్ టైరుకి పంచరు అవ్వటం మొదలెట్టింది. రోజూ పంచరు వేయించటం, ఓ ఇరవై రోజులకు ఆ బొక్కల ట్యూబు పనికిరాదని కొత్తది కొనటం, ఇలా సంపాదించిన దాంట్లో సహం దీనికిందే వెయ్యాల్సొస్తుంది. ఇంతవరకు రెండు ట్యూబులు మార్చాడు. ఇంకెన్ని మార్చాలో?

భయపడుతూనే అతడు మర్రి చెట్టును దాటబోయాడు. "పుస్. . .స్" మని సన్నని చప్పుడు. గాలి ట్యూబులోంచి కాక తన శరీరంలోంచి వచ్చినంతగా నిస్సత్తువ ఆవరించింది.

పొద్దున్నే పంచరేయించుకొని దుకాణానికి వెళ్ళి చీకటి పడుతూనే ఇంటికి బయలుదేరాడు. మర్రిచెట్టు చుట్టూ అతని ఆలోచనలు తిరుగుతున్నాయి. "అక్కడకు వచ్చేటప్పటికే ఎందుకు పంచరు పడుతోంది?. కొంపదీసి ఏ దెయ్యామో తనను ఆటపట్టించటం లేదు కదా!" 'అమ్మో' దెయ్యమన్న తలంపుకే అతని ఒళ్ళు జలదరించింది.

నెమ్మదిగా మర్రి చెట్టును సమీపించాడు. భయం భయంగా చెట్టు దాటాడు. ఏమార్పూ లేదు. 'హమ్మయ్య' ఈ రోజు పంచరు పడలేదు. సంతోషించాడు సింహాచలం. "పుస్. . .స్స్. . .స్." మని చప్పుడు వినబడింది. నీరసంగా తోసుకుంటూ ఇంటికి వెళ్ళాడు.

మర్నాడుదయం గాలిలేని తన సైకిల్ టైరువంక సింహాచలం నిర్లిప్తంగా చూసాడు. అతనికి జాలివేసింది. అచ్చం అది తనలాగనే శక్తి లేనిదై ఉంది. ఆలోచిస్తుంటే అతనికి జీవితంపై విరక్తి కలుగుతోంది. అంతా మిధ్య లాగ, మాయలాగ కనిపిస్తోంది. 'భగవంతుడు ఆడించే వింత నాటకంలో భాగమే తన సైకిలు టైరు పంచరు' అని అతడు నమ్మాడు. కానీ అంతలోనే కర్తవ్యం గుర్తుకు వచ్చింది. పంచరేయించి, ఒక మంత్రగాడిని

పిలుచుకువచ్చి జరిగింది చెప్పి నివారణోపాయం సెలవియ్యమని బావురుమన్నాడు.

మంత్రగాడు ఓ నిముషం పాటు కళ్ళు మూసుకుని దీర్ఘంగా ఆలోచించాడు. ఏవో లెక్కలు కట్టాడు. కళ్ళు తెరచి "నా కంతా అర్థమయ్యింది. నువ్వేం భయపడకు. ఆ దెయ్యం నీకూ, నీ సైకిలుకీ ఏ కీడూ చేయకుండా కాపాడతాను. ఈ తాయెత్తుని సైకిల్‌కి కట్టు. ఓ పదికొట్టు." అన్నాడు.

తప్పదనుకొంటూ, ఎందుకైనా మంచిదని ఇరవై రూపాయిలిచ్చి తన చేతికి రెండోది కట్టుకున్నాడు సింహాచలం. మంత్రగాడు సింధూరాన్ని సైకిల్‌కి పూసాడు. వేపాకులు కట్టాడు. సింహాచలానికి తన సైకిలుని చూస్తే అమ్మోరుని చూసినట్లనిపించింది. ఏదో ప్రాణం ఉన్న మేకపోతులా కనిపించింది. టయిమయ్యిందనుకుంటూ దుకాణానికి పోయాడు. తిరిగి ఏడప్పుడు ఇంటికి బయలు దేరాడు.

అతని మనసంతా ఉల్లాసంగా ఉంది. ఇక తాను పంచర్లకు డబ్బు తగలెయ్యనక్కర లేదు. ముందు డబ్బు కూడితే చెప్పులు కొనాలి. చొక్కా కుట్టించుకోవాలి. ఊహు! వాచీ కొనుక్కోవాలి. లేకపోతే తాటాకులు తీయించి పెంకులు వేయించుకోవాలి. ఇలాంటి ఆలోచనలతో అతను మర్రిచెట్టును సమీపించాడు. అతనోసారి మర్రిచెట్టు కేసి గర్వంగా 'నేనే గెలిచా'నన్నట్లు చూసాడు. విజయోత్సాహంతో ఎంతో ఆత్మ విశ్వాసంతో మర్రి చెట్టును దాటాడు. పంచరు పడింది.

ఆరోజు రాత్రి సింహాచలానికి నిద్రపట్టలేదు. చచ్చిపోదామన్న ఆలోచనలు వచ్చాయి. నిగ్రహించుకున్నాడు. తన సైకిల్ హేండిల్‌కి నోరువచ్చి తనకేసి చూసి నవ్వినట్లనిపించింది. టైరు, కిరాణా కొట్టు సుబ్బిశెట్టి నవ్వితే అతని పొట్ట ఎలా కదులుతుందో అలా కదిలినట్లనిపించింది. కళ్ళు మూసుకుంటే మర్రిచెట్టు దగ్గర ఎవరో తనని శూలాలతో తూట్లు, తూట్లు పొడుస్తున్నట్లు అనిపించింది. చివరకు ఏదో నిశ్చయించుకున్న వాడల్లే సగం నిద్రతోనే తెల్లారి లేచి తయారై, తి.?. దుకాణానికి నడుచుకుంటూ పోయాడు. ధృడనిశ్చయంతో ఉన్న వాడు కావటంచే మూడు కిలోమీటర్లు పెద్ద దూరంలా అనిపించలేదతనికి. కానీ తిరిగి వచ్చేటప్పటికి ఆ చీకట్లో ఒక్కో అడుగు ఒక్కో మైలులా గడిచింది. దానికి తోడు చీకట్లో మర్రి చెట్టు దగ్గర దెయ్యం భయం. ఇంటికి చేరేటప్పటికి తొమ్మిదయ్యింది. ఒళ్ళంతా ఒహటే నొప్పులు. ఆ దెబ్బకి రెండ్రోజులు శెలవు పెట్టాల్సి వచ్చింది. ఇలా చీటికీ మాటికీ సెలవుపెడితే యజమాని ఉద్యోగం ఊడగొడతాడని అతనికి తెలుసు.

మూడో రోజు ఉదయాన సైకిలు షాపు అబ్బి దగ్గరకుపోయి తను ఆ రెండ్రోజులు ఆలోచించి రూపొందించిన ప్రణాళిక చెప్పాడు. అతను అయిష్టంగానే ఒప్పుకున్నాడు. దానిప్రకారం సింహాచలం నెలకు పదిరూపాయలు సైకిలుషాపు అబ్బికి ఇస్తాడు. ఆ నెలలో ఎన్నిపంచర్లు పడినా అది సైకిల్ షాపు అబ్బిదే బాధ్యత. తను నయాపైసా కూడా ఎక్కువ ఇవ్వడు. తన తెలివికి మనసులోనే ఆనందపడ్డాడు సింహాచలం. కానీ అదేంటో గానీ అప్పట్నుంచి అసలు పంచర్లే పడటం లేదు. ఓనెల గమనించిన సింహాచలానికి తను సైకిలు షాపు వాడికి అప్పణంగా డబ్బు అప్పచెప్తున్నట్లు అనిపించింది. మరుసటి నెల నుంచి ఆ ఒప్పందం రద్దు చేసుకున్నాడు. అదేంటో విచిత్రంగా మళ్ళీ పంచర్లు పడటం ప్రారంభించింది. ఈ సారి ఇదే ఒప్పందాన్ని మరొకనితో పదిహేను రూపాయలకు కుదుర్చుకున్నాడు. చిత్రంగా అప్పట్నుంచి రెండు టైర్లకూ, వీలైతే ఒక్కో టైరుకు రెండు పంచర్లు పడటం ప్రారంభించింది. ఆ రెండోవాడు నెలకు పాతిక రూపాయలకు తక్కువైతే చేసేది లేదని భీష్మించుకున్నాడు. చివరకు తప్పనిసరిగా మళ్ళీ మొదటి అబ్బినే ఇరవైరూపాయలకు కుదుర్చుకున్నాడు సింహాచలం.

ఇప్పుడు పంచర్లు పడటంలేదు. అయినా సింహాచలం నెలకు ఇరవై రూపాయలు సైకిలు షాపు వాడికి ఇస్తున్నాడు. అప్పనంగా వాడికెందుకివ్వటం, తానే సైకిల్‌కి బొక్కపొడిచి పంచరేయిద్దామని అనుకున్నా, కొత్త ట్యూబు కొనాల్సొస్తుందన్న భయంతో విరమించుకున్నాడు సింహాచలం. మొత్తానికి పంచర్ల మిష్టరీ అతనికి వీడని చిక్కుముడిగానే మిగిలిపోయింది.

పంచరు పడే రోజుల్లో మఱ్ఱి చెట్టు దగ్గర దిగి నడిపించుకొని వెళ్ళవచ్చన్న ఆలోచన సింహాచలానికి ఇప్పటకీ రాలేదు.



# ఇదీ (దు)స్థితి!

"నాకు ఓ వంద రూపాయలు కావాలి".

"ఇప్పుడేమంత అవసరం వచ్చి తగలడింది. అంత డబ్బెందుకో?"

"వీధిలోని స్నేహితులతో శ్రీరామనవమి ఉత్సవానికి పక్కూరు వెళ్లాలి అందుకని. . ."

"అందుకని నీకు వంద రూపాయలు ఇమ్మంటావ్. ఆ...!. ఇక్కడ నాకేమి డబ్బు చెట్లకి కాయట్లేదు. నా దగ్గర లేవు కానీ ఎక్కడకీ పోక ఇంటి పట్టునే ఉండు".

"నేనేమి నా సరదాలకి అడగట్లేదు. దేవుణ్ణి దర్శించటం కోసమే అడుగుతున్నాను. ఎలాగైనా ఓ వంద సర్దు."

"అమ్మో! బెదిరిస్తున్నావే? అంత భక్తి ఉన్నవాడివి. ఏవో పనికిమాలిన అవసరాలు చెప్పి నాదగ్గర గుంజే వాడివే. . . ఆ డబ్బుతో పోవచ్చు కదా!"

"నేనెప్పుడు పనికిమాలిన అవసరాలు చెప్పలేదు. పనుండే డబ్బు అడిగే వాణ్ణి అవసరార్థం ఖర్చు పెట్టేవాణ్ణి. ఇప్పుడు నా దగ్గర డబ్బులేదు. ఓ వందియ్యి. ఉత్సవాలకి వెళ్లాలి."

"ఛీ. . . ఛీ. . .! ఎంత చెప్పినా వినిపించుకోకుండా ఎప్పుడూ డబ్బుకి పీక్కుతింటేనే సరిపోతుంది. పనిపాటా లేనప్పుడు ఇంట్లో తిని కూర్చోక అడ్డమైన వ్యాపకాలన్నీ నెత్తినేసుకోవటం ఎందుకో? ఇంద ఈ యాభై తీసుకొని తగలడు. ఇంతకుమించి నీకు చిల్లిగవ్వైనా ఇవ్వను." కసురుకుంటూ కొడుకు చేతిలో యాభై నోటు పెట్టాడా కన్నతండ్రి.

"హు - కర్కోటకుడు. ఇలాంటి తండ్రి పగవాడికి కూడా వద్దు." తిట్టుకున్నాడా కొడుకు. యాభైతో ఏం జల్సాలు చేద్దామా అని ఆలోచిస్తూ. . .!

***

"నాకు ఓ వంద రూపాయలు కావాలి".

"ఇప్పుడేమంత అవసరం వచ్చి తగలడింది. అంత డబ్బెందుకో?"

"వీధిలోని స్నేహితులతో శ్రీరామనవమి ఉత్సవానికి పక్కూరు వెళ్లాలి అందుకని. . ."

"అందుకని నీకు వంద రూపాయలు ఇమ్మంటావ్. ఆ...!. ఇక్కడ నాకేమి డబ్బు చెట్లకి కాయట్లేదు. నా దగ్గర లేవు కానీ ఎక్కడకీ పోక ఇంటి పట్టునే ఉండు".

"నేనేమి నా సరదాలకి అడగట్లేదు. దేవుణ్ణి దర్శించటం కోసమే అడుగుతున్నాను. ఎలాగైనా ఓ వంద సర్దు."

"అమ్మో! బెదిరిస్తున్నావే? అంత భక్తి ఉన్నవాడివి. ఏవో పనికిమాలిన అవసరాలు చెప్పి నాదగ్గర గుంజే వాడివే. . . ఆ డబ్బుతో పోవచ్చు కదా!"

"నేనెప్పుడు పనికిమాలిన అవసరాలు చెప్పలేదు. పనుండే డబ్బు అడిగే వాణ్ణి అవసరార్థం ఖర్చు పెట్టేవాణ్ణి. ఇప్పుడు నా దగ్గర డబ్బులేదు. ఓ వందియ్యి. ఉత్సవాలకు వెళ్లాలి."

"ఛీ. . . ఛీ. . . ఎంత చెప్పినా వినిపించుకోకుండా ఎప్పుడూ డబ్బుకి పీక్కుతింటేనే సరిపోతుంది. పని పాటా లేనప్పుడు ఇంట్లో తిని కూర్చోక అడ్డమైన వ్యాపకాలన్నీ నెత్తినేసుకోవటం ఎందుకో? నువ్వు అరచి గీ పెట్టినా నా దగ్గరొక్క దమ్మిడీ కూడా లేదు. ఇంట్లోనే కృష్ణా! రామా! అని పడుండు" కసురుకున్నాడొక కొడుకు తన కన్న తండ్రిని.

"పోన్లే! అయినా ఒక్కసారిగా అంత డబ్బడిగితే వాడు మాత్రం ఎక్కడ నుంచి తెస్తాడు? పాపం వాడి దగ్గర నిజంగానే లేదేమో!" సర్ది చెప్పుకున్నాడా తండ్రి దైవ దర్శనానికి వెళ్ళలేనందుకు బాధ పడుతూ!



# అమ్మ ప్రేమ

ఇన్నాళ్ళకి ఈ అద్దె కొంప నుండి విముక్తి కలిగింది. హాయిగా సొంతింటికి పోవచ్చు. అక్కడ మేకులు కొట్టవద్దనే వాడుకానీ, నీళ్ళు పొదుపుగా వాడమనే వాళ్ళుకానీ, ఎవ్వరూ ఉండరు. మాదే రాజ్యం. మా పొదరిల్లు వంటి గూటికి మేమే రారాజులం."

ఇంచుమించు మా అందరి మనసుల్లోనూ ఇదే భావం. అమ్మా, నాన్న, నేను అందరం ఇలానే ఆలోచిస్తున్నాం. సామాను సర్దటం పూర్తయ్యింది. లారీలో ఎక్కించిన తర్వాత పక్కింటి కామాక్షిగారు వారి మనవరాలు రాధను పట్టుకొని వచ్చారు. రాధ రెండేళ్ళది. ముద్దుగా మాట్లాడుతుంది. మరింత ముద్దుగా ఆడుతుంది.

రాధను చూడగానే అమ్మకెందుకో కళ్ళు చెమ్మగిల్లాయి. అమాంతం ఆ పసిపాపను ఎత్తుకొని ముద్దులాడింది.

"ఊరుకోమ్మా! ఏమంత ఊరు విడిచిపోతున్నావని? ఈ ఊరేగా! వారానికోసారైనా మీరో మేమో వస్తుంటాం కదా!" కామాక్షమ్మగారు ఓదార్చారు.

తడికళ్ళతోనే అమ్మ శెలవు తీసుకుంది.

కొత్త ఇంట్లోకి వచ్చిపడ్డాం. ముందుగా అనుకున్నట్లే ఇక్కడ చాలా ఆనందంగా ఉంది. అమ్మ వారానికోసారైనా పాత ఇంటి వైపు వెళ్ళి రాధను చూసి వస్తుండేది. అది చాలదన్నట్లు మధ్యలో ఓ రెండు మూడు సార్లైనా నన్ను వెళ్ళి రాధను తీసుకు రమ్మని పోరేది.

"ఒరేయ్ నాయనా రాధనోసారి తీసుకురారా! ముచ్చట తీరలేదు" ఇదీ అమ్మవరస.

నేను చాలా ఓపికగా అమ్మకి బదులిచ్చే వాణ్ణి 'మన పిల్లలు కాని వాళ్ళపై అంత మమకారం, ప్రేమ కూడదని.'

"అయినా ఆ ఇంటినుండి వచ్చేసాక ఆ పిల్లెవరో, మనమెవరమో! ఎందుకలా ఆ పిల్లని కలవరిస్తావ్?" అనేవాడ్ని.

"నువ్వంతేరా కర్కోటకుడివి. నీ మనసు రాయి. పాషాణం. నీకు ప్రేమలు ఆత్మీయతలు పట్టవు." అనేది అమ్మ.

అంతే! విషయం నా మీదకి రావటంతో నాకు వీలున్నప్పుడు వెళ్ళి రాధని తీసుకొని వచ్చేవాణ్ణి. లేనినాడు కుదరదని చెప్పేవాణ్ణి.

ఓ రోజు ఎప్పటిలానే రాధని తీసుకురమ్మంటే తప్పనిసరిగా వెళ్ళి తీసుకువచ్చాను. అమ్మ ఆ రోజు ఎంతో ఆనందించింది. రాధతో ఎడతెరిపి లేకుండా కబుర్లాడింది. ఎత్తుకొని ఇల్లంతా తిరిగింది. నేను ముభావంగా నా గదిలోకి పోయి పత్రిక తీసి చదువుకుంటున్నాను.

అమ్మ వంట చేస్తూంది గాబోలు. రాధ ఒక్కర్తే ఇల్లంతా కలియతిరుగుతోంది. నా గదిలోకి వచ్చినన్ను చూసి చేతులూపి బుర్రాడించింది. నా కెందుకో ముచ్చట వేసి రమ్మని సైగ చేసాను. బుల్లి అడుగు లేసుకుంటూ నా దగ్గరకు వచ్చింది. చేతుల్లోకి తీసుకొని బుగ్గలను ముద్దాడాను. ఆ పిల్ల ఆల్మారాలో ఉన్న ఎలుగుబంటి బొమ్మకేసి ఆసక్తిగా చూడటం గమనించి "కావాలా?" అని అడిగాను.

"ఊఁ" అంటూ బుర్రూపింది. నేను ఆ బొమ్మ తీసి ఇచ్చి ఆడుకోమన్నాను. ఆరోజంతా రాధ ఆ బొమ్మ విడువనే లేదు.

సాయంత్రమయ్యాక రాధని వాళ్ళింటికి తీసుకొని పోవటానికి ఆమెను పట్టుకొని బయల్దేరాను.

అమ్మ " మళ్ళీ రావే రాధా!" అంటూ రాధ బుగ్గగిల్లింది.

నేను రాధకిద్దామని ఎలుగుబంటి బొమ్మను కూడా పట్టుకున్నాను. అది ఎవరూ గమనించలేదు.

రాధను వాళ్ళ ఇంట్లో అప్పగించి వచ్చేసరికి అమ్మ ఆదుర్దాగా దేనికోసమో వెదుకుతోంది. ఏంటని అడిగాను.

"ఇక్కడ అల్మారాలో బొమ్మండాలి ఏదిరా?"

"ఓ అదా, ఇందాకనే రాధ ముచ్చటగా అడిగితే కాదనలేక ఇచ్చేసాను. ఇప్పుడు వాళ్ళింట్లో దాంతోనే ఎంచక్కా ఆడుకుంటుంది."

"ఓరి వెధవ! మనింట్లో బొమ్మని ఆ పిల్లకిచ్చేస్తావా? నీకేమొచ్చిందిరా! రేపుదాయాన్నే వెళ్లి ఏదో పిల్ల మారాం చేస్తే ఇచ్చానని సర్ది చెప్పి తీసుకువచ్చేయ్ అర్ధమయ్యిందా"?

నిశ్చేష్టుడనయ్యాన్నేను. అసలు ప్రేమలు ఆత్మీయతలు అంటే అమ్మదృష్టిలో ఏంటో, నన్ను కర్కోటకుడని ఎందుకంటారో నాకెంత ఆలోచించినా అర్థం కావటం లేదు.

# స్టెత్‌స్కోప్

అదేంటో గానీ, నాకు చిన్నప్పటి నుంచి స్టెత్‌స్కోప్ అంటే ప్రత్యేకమైన ఆసక్తి ఉండేది. నేను చదివిందేమో లెఖ్ఖలు గ్రూపులు. నాకు బోటనీ, జువాలజీల గూర్చి సరైన అవగాహన కూడా లేదాయే. ఏదో నేను చదివిన లెఖ్ఖల గ్రూపులే ఈ గుమాస్తా గిరి ఇప్పించి పుణ్యం కట్టుకున్నాయ్. అయితే చిన్నప్పటి స్టెత్‌స్కోప్ మీది వ్యామోహం తాత్కాలికంగా ప్రక్కన పెట్టినా, మొన్న నా డాక్టర్ ఫ్రెండ్ నొకణ్ణి చూడటానికి వెళ్ళినప్పుడు స్టెత్‌స్కోప్ కనపడటం తటస్థించింది. అంతే పూర్వపు ఆసక్తి తిరగబడి ఎలాగైన నేనొక స్టెత్‌స్కోప్ సంపాదించాలని నిశ్చయించుకున్నాను. మొత్తానికి ఎలాగయితేనేం నే చెప్పను కానీ, ఒక స్టెత్‌స్కోప్ సంపాదించాను.

ఆ రోజు నా ఆనందానికి అవధులు లేవు. ఉత్సాహంగా నాలుగ్గంటలకే ఇంటికి చేరాను. కాఫీ పట్టుకొచ్చిన శ్రీమతితో సరసాలాడుతూ స్టెత్‌స్కోప్ చెవులకు పెట్టుకొని ఆమె గుండెల కాన్చాను. " ఏమిటండీ ఈ పిల్ల చేష్టలు" అంటూ విదల్చబోయినా నేను వదల్లేదు. నవ్వుతూ ఆమె గుండెలకాన్చి విన్నాను.

"ఏమిటీయన ఈ రోజింత తొందరగా వచ్చారు. హు! పక్కింటి పిన్ని గారితో సరిగ్గా మాట్లాడటమే కుదరలేదు."

నేను ఖంగుతిన్నా స్టెత్‌స్కోప్ అద్భుతంగా పనిచేస్తున్నందుకు ఆనందించాను. హాల్లోకి నడిచి ఆ రోజు కనపడిన పేపరు తీసి చూస్తున్నాను. బాగా పేరు మోసిన రాజకీయ నాయకుడొకడు ఫోటోతో సహ ఒక స్టేట్‌మెంట్ ఇచ్చాడు. 'హవాలా కేసులో నేను నిర్దోషిని' అని ప్రక్క పేజీ తిప్పబోతూ నాకో ఆలోచన వచ్చింది. వెంటనే ఆ ఫోటో ఆసామి గుండెలకు స్టెత్‌స్కోప్ ఆన్చి చెవిలో పెట్టుకున్నాను.

" ఈ పేపరోల్లేట్రా బాబూ! ఉన్న గుట్టంతా బైట పెట్టేస్తున్నారు" అని వినపడింది.

ఈ సారి చివరి పేజీలో పడిన ఓ ప్రముఖ క్రీడాకారుని ఫోటో చూసాను. "ఫలానా తారను నేను చేసుకుంటాననటం అబద్ధం" అని ఉంది. అతని గుండె కాన్చి విన్నాను.

" అవును నిజమే కదా! ఆమెను నేనెందుకు చేసుకుంటాను? నా ఆటను ఎరగా చూపి మరో పదిమంది తారల్నయినా పట్టొద్దా?" అని వినపడింది.

"అమ్మో ఘటికుడే" అయినా ఇది స్టెత్‌స్కోప్ కాదు. ట్రూత్ స్కోప్ అనుకున్నా. ఆ రోజు నుండి రకరకాల మనుషుల హృదయాల్లో ఏముందో తెలుసుకొని థ్రిల్‌గా ఫీలవ్వటం అలవాటయిపోయింది. ఓ రెండ్రోజులు గడిచాయి. ఈ మధ్యలో చాలామంది మనస్తత్వాలు తెలుసుకున్నాను. మా ఆఫీసులో నా క్రింద పనిచేసే వాడొకడు నా సీటు కెసరు పెట్టాడని తెలుసుకొని, వాణ్ని దూరంగా ఉంచటం మొదలెట్టాను. ఆ రెండ్రోజులు గడిచాక నాకో చిత్రమైన ఆలోచన వచ్చింది.

"నా కెదురుగా ఉన్న నా ఇష్టదైవమైన ఆంజనేయస్వామి గుండెల్లో ఏం వినపడుతుందో?'

" ఆ ఇంకేం వినపడుతుంది... 'రామ రామ' అని వినపడుతుంది అంతే"

అయినా ఆసక్తి చంపుకోలేక 'ఓసారి వింటే పోలా' అనుకుంటూ ఆంజనేయ స్వామి పటం దగ్గరకు వెళ్ళాను. స్వామి నా వైపు గుడ్లురిమి తీక్షణంగా చూసినట్లనిపించింది. కొంచెం భయమేసి ఓ అడుగు వెనక్కి వేసాను.

"ముందు నా గుండెలో ఏం వినపడుతుందో చూద్దాం. తర్వాత స్వామిది". నా మనసుకు సర్దిచెప్పుకున్నాను.

వెంటనే స్టెత్‌స్కోప్ చెవులకు పెట్టుకొని నా గుండె కాన్చి విన్నాను. ఏమి వినపడలా. కనీసం గుండె చప్పుడు కూడా వినపడట్లా. నాకొక్కసారి భయమేసింది. నేనుగానీ చచ్చానా ఏమిటి? ఓసారి గిల్లుకున్నాను "అబ్బా!" బాధ తెలిసింది. 'హమ్మయ్య' నే చావలేదు! అయినా చచ్చుంటే నించుటానేమిటి? అచేతనంగా పడుకుంటాడు గాని, ఏమిటో చాదస్తం అని నవ్వుకున్నాను. అంతలోనే స్టెత్‌స్కోప్ పనిచెయ్యనందుకు విపరీతమైన దుఃఖం వచ్చింది. ఆ రోజు నుంచి స్టెత్‌స్కోప్ కనీసం గుండె చప్పుళ్ళనైనా వినిపించటం మానేసింది.

కొన్నాళ్ళు గడిచాక మరో చిత్రమైన ఆలోచన వచ్చింది. వెంటనే స్టెత్‌స్కోప్ ఇరువైపులా రెండు తొడుగులు పెట్టి కళ్ళకు కట్టుకొని నా భార్య నిద్రపోతున్నప్పుడు ఆమె గుండెల కాన్చి చూసాను. పచ్చని పంట చేలు కనపడింది. ఒక్కసారిగా రెండు ఆనందాలు కలిగినై. ఒకటి నా ప్రయోగం ఫలించినందుకు ఐన్‌స్టీనయినంత ఆనందం, రెండు నాకు అంత గుణవతి అయిన భార్య లభించినందుకు.

తెల్లారిలేచి నాకు నచ్చిన ఫోటోలకాన్చి చూసాను. అదేంటో చాలా మంది గుండెల్లో మైదానాలు, రాళ్ళూ రప్పలూ, ఎండిపోయిన పొలాలు తప్ప మరేమీ కనబడట్లా. ఇలా కాదని

చెప్పి ఓ చరిత్ర పుస్తకం తీసాను. అందులో మొదట కనపడిన జిన్నా గుండెలకాన్చి చూసాను. అది కూడా మైదానం లాగనే ఉంది. కాని జాగ్రత్తగా పరిశీలిస్తే అక్కడేదో శవం పాతిపెట్టినట్టు అవగతమవుతుంది. ఆశ్చర్యపోతూ ప్రక్కపేజీలోని హిట్లర్ గుండెకాన్చి చూసాను. మళ్ళీ ఆశ్చర్యం. ఇతని గుండెల్లో కూడా స్మశానమే కనపడింది. అయితే జిన్నాలా కాదు. ధైర్యంగా "ఇది శ్మశానం" అన్న బోర్డ్ కనపడింది. మరో మహానుభావుడి గుండెల్లో మంచుగడ్డ కనపడింది. గాంధీ గారి గుండెల్లో ఏముందా? అని చూసాను భూమిలో పాతిన లంకెబిందెలు కనపడ్డాయి. 'అబ్బో' అంత గొప్పవారన్నమాట అనుకున్నాను. నాలో ఏముందో చూద్దామనిపించింది. అంతలోనే మళ్ళీ స్టెత్స్కోప్ పనిచెయ్యటం మానేస్తుందేమోనని భయం వేసింది.

" ఆ ఏముందీ! నా గుండెల్లో కూడా గాంధీ గారి గుండెల్లోలా ఏ లంకెబిందెలో లేక ఒక తేజస్సు విరజిమ్మే జ్యోతో కనపడుతుందిలే" అని సముదాయించుకున్నాను.

అయినా కుతూహలం చంపుకోలేక 'అప్పుడంటే స్వామి గుండెల్లో ఏముందో విందామన్న ఆలోచనతో అపచారం చేసి స్టెత్స్కోప్ ప్రభావం పోగొట్టుకున్నాను. ఇప్పుడా పాడు ఆలోచనే రాదు. స్వామి గుండెల్లో నిక్షేపంగా సీతారాములు కనపడుతున్నారు కదా! కనుక నేను నిర్భయంగా నా గుండెల్లో ఏముందో చూడొచ్చు' అని నచ్చ చెప్పుకొని ఆలస్యం చేయకుండా నా గుండెలకాన్చి చూసాను.

అదేంటో విచిత్రంగా ఏమీ కనపడలేదు. చీకటిగా ఉంది. భయమేసి కనపడిన అన్ని ఫోటోలకు ఆన్చి చూసాను.

"హతవిధీ! మళ్ళీ మొరాయించి మొండికేసింది. ఇదంతా స్వయం కృతాపరాధం." నెత్తి నోరు కొట్టుకున్నాను. స్టెత్స్కోప్ పారేద్దామన్నంత కోపం వచ్చింది. అయినా ఎందుకో విరమించుకొని అటకపై విసరివేసాను. ఎప్పటికైనా ఏ ముక్కుకో తగిలించికొని వాసనలు చూడటానికి పనికి వస్తుందేమోనని.

కావాలంటే రండి. ఇప్పటికీ అది మా అటకపైనే తుప్పుపట్టి, దుమ్ముపట్టి, శిధిలమై ఉంది. నా మాట నమ్మకపోతే పరీక్షించండి. అది చెవులకాన్చితే వినపడదు. కళ్ళకు కట్టి గుండెలకాన్చితే ఏమీ కనపడదు. అప్పటికైనా నమ్ముతారు, నేను చెప్పింది నిజమని!